a



# ప్రతిమాదేవి

114 (చరిత్రాత్మక నవల)



ఉ
114

రచయిత్రులు :

అయితం ఇందిరా భారతీదేవులు



PUBLISHED BY

VADLAMUDI RAMAIAH
EDUCATIONAL PUBLISHER
NELLORE

2-

# తొలిపలుకు

పోయిన 1946 వేసఁగి సెలవులలోఁ గళాశాల మూయఁబడిన వెనుక నెల్లూరు మండలమునందలి గూడూరునకు మాగృహమునకు మరలితిమి. అప్పుడు పూజ్యపాదులు మా తండ్రిగారి యాజ్ఞాప్రోత్సాహములచే దీనిని రచించితిమి.

మా ప్రథమరచనము జననీశతకము. ఇది యముద్రితము. ద్వితీయము శ్రీ అన్నపూర్ణా సుభాషితరత్నావళి. 250 పద్యములకృతి. ఇది చెన్నపురి జాతీయ విజ్ఞానమందిరము వారిచే ముద్రితము. ఆంధ్రలోకము మారచనల నాదరించి యాశీర్వదింతురని నమ్మెదము.

ప్రస్తుత కథకు బీజము 'Illustrated Weekly of India' లోని 'అహమ్మదుషా ప్రణయములు' అను వ్యాసము.

ఇందువచ్చు శాహోజీసోదరులు, షహోజీ. లాలాబాయి, రాణీబాయి, సంస్థానసింగు, శత్రుశాల్జీలు చారిత్రక వ్యక్తులు. శత్రుశాల్జీ మరణము, కపట వివాహోపాయము చారిత్రకములే. ఇందలి మా యభిమానపాత్ర జహనారా బీగము కల్పితము.

మేము బాలికలము గావునను క్రొంగ్రొత్తగా సాహిత్య క్షేత్రమునఁ బ్రవేశించుచున్నవారము గావునను, పరిణత బుద్ధులు పితృకల్పులైన యాంధ్రులు మా యీ సారస్వతసేవను మన్నించి ప్రోత్సాహమిచ్చి యాశీర్వదింతురు గాక అని ప్రార్థించుచున్నాము.

మా బుద్ధిలతికా దోహదమునకు సహజ జీవన స్రవంతులైన వారును, మహాకవులును నైన శ్రీ అయితం కాశీవరప్రసాదరాయ మహాశయుల పుత్రికలమని యైన మమ్ము మన్నించి యాంధ్రలోకము దీని నాదరించుఁ గాత!

గూడూరు.
1947 మార్చి నెల

—అయితం ఇందిరా భారతీదేవులు

ఓం.

# ప్రతిమాదేవి

## మొదటి ప్రకరణము

(సోదరులు)



1410వ సంవత్సర ప్రాంతమున గుజరాతు రాజ్యమును ముజఫర్షా దౌహిత్రుఁడగు 'అహమ్మదుషా' పరిపాలించుచుండెను. ఇతఁడు ముసల్మాను. వీరోచిత శారీరక మానసిక బలములు గలవాఁడు. ఇతని మోమునఁ వైరి దుర్నిరీక్ష్య తేజము తాండవించుచుండెను.

ఇతఁడు మడమత్రిప్పని యుద్ధవీరుఁడు. వైరివీర నికాయమును మత్తమత్తేభ యూథమును క్రుద్ధకేసరి విఘాలించులీల, గాఢాంధకారమును చండభానుఁడు విరియించు మాడ్కి, నొనర్చువాఁడు. ఈతని ధాటికోర్వఁజాలక యోధాగ్రేసరులగు శత్రురాజులు నిరంతరము పాఱుచుందురు. నామశ్రవణముననే పగవారు ప్రకంపితగాత్రులగుచుందురు.

ఇతఁడు పరాక్రమశాలియయ్యు విషయవాంఛాలోలుఁడు. కామినీ జనములను బలాత్కృతిని దెచ్చి తన యంతిపురి నుంచికొను నీచస్వభావము నైసర్గికముగాఁ గలవాఁడు. ఈ కారణముననే శిష్టాచారసంపన్నులగు హిందూ

రమణులఁ బెక్కండ్రను పట్టపుదేవులతో వివాహమాడెను. అంత
తో నీతఁడు తనివిసనక యింకను సౌందర్యవతులగు రాకు
మారికలకై నిరంతర ప్రయత్నలోలుఁడై యుండెను. విషయ
లోలుని విధాన మిద్దియెగదా!

ఏతత్కారణములచే ననేక రాజవంశములతో నీత
నికి ద్వేషభావ మేర్పడియుండెను. పాపము! పుత్త్రికలను
గన్న హిందూ సంస్థానాధిపతుల యవస్థ దయనీయముగా
నుండెను. ఈతని యుపద్రవమును దప్పించుకొని జయించి
సంహరించు తరుణమునకై యుపాయమునకై క్షత్రియవీరు
లెదురు చూచుచుండిరి.

ఈతనిచే మిక్కుటముగఁ బీడింపఁబడినవారు సుప్ర
సిద్ధ వాఘేలీవంశస్థులు. ఈ వంశస్థులలో కర్ణుఁడనువాఁడు
మహత్తర ప్రతిభాశాలి. కీర్తిమూర్తి. ఆతని వంశస్థులే యగు
వాఘోజీ, జితోజీసోదరులు అహమ్మదుషాచే అపహృత
సర్వస్వులై దేశభ్రష్టులై దీనులై కాననముల పాలైరి.
వీరు సర్వస్వమును గోల్పడి నామమాత్రావశేషులై నిర్ధ
నులై, నిరధికారులై దరిద్రదేవతా కరతల పాంచాలికలైరి.
వీ రరణ్యములలో ఆటవికుల చందమునఁ దిరుగుచు దుంప
లను గాయలను మెసవుచు రహస్యస్థలముల నేర్పఱచుకొని
ప్రచ్ఛన్న వేషమున మెలఁగుచు స్వీయాభ్యుదయ కారణో
పాయముల నరసికొనుచుండిరి.

దారిద్ర్యముచే దాక్షిణ్యము పటాపంచలుకాఁగా,
కష్టములచే హృదయము కఠోరముకాఁగా, వీరు ధౌర్త్య

మునకుఁ గడంగిరి. అహమ్మదుషా పాలనమునకు విప్లవ కారులై దారులఁగొట్టి వంశధన గౌరవోన్నతులగు వారల నపహరించి, విత్తమునకు విక్రయించుచుండిరి. అందుమూల మున జీవించుచుండిరి. సాత్త్వికులైనను, సజ్జన శిరోమణు లైనను, నపహృత సర్వభాగ్యు లగునప్పుడు అన్యాయము లకుఁ గడఁగెదరనుచో, సహజరాజసశౌర్యశీలురగు వీరు ప్రతీకారమునకుఁ గడఁగిరనుటలో వింతలేదు.

ఈ కార్యములు 'అహమ్మదుషా' నిరంకుశపాలనము నకు, గౌరవమునకును ప్రతిబంధకములై యుండెను. ఎన్ని యో ప్రయత్నములఁ గావించియు వారినిఁ బట్టికొనఁజాలక విఫలమనోరథుఁడయ్యెను. అయినను వారినిఁబట్టు తెఱు వూహించుచునే యుండెను.

ఈసోదరులకు 'లాలాబాయి' అను త్రిలోకసుందరి సోదరి గలదు. ఈముగ్ధమోహన రూపవతుల కందఱకు శిరో లంకారముగా నుండెను. సౌందర్యమునకుఁ దగిన సద్గుణము లీమెకు సహజాలంకారములై సువర్ణమునకుఁ సువాసనవలెఁ బరిమళించుచుండెను. పదియాఱువన్నె పసిఁడికేని లోప మున్నదేమోగాని, యీమె కళయం దెట్టిలోపము లేదని సంగ్రహముగఁ జెప్పినఁ జాలును.

ఈమె లావణ్యము కర్ణాకర్ణిగ నవాబు శ్రోత్రముల కెక్కెను. వినినతరువాత నట్టి యపురూపలావణ్యవతిని అహ మ్మదుషావంటి కాముకుఁడు వదలునా? ఈతం డీమెకై యెన్నియో పన్నాగములఁ బన్నియు విఫలుఁడగుచుండెను.

ఈతని మాయావాగురులనుండి సోదరు లీ ముగ్ధబాలికను గాపాడుచుండిరి. కాని అహమ్మదుషా యూరకుండు స్వభావమును గలవాఁడుగాఁడు. ఆ కారణమున, నవాబు తన యావచ్ఛక్తిని వినియోగించి సఫలీకృత మనోరథుఁ డగుటకు యత్నించుచుండెను.

కటికి బోయ సాధుమృగమని కురంగిపై కరుణించి వలవైచుట మానఁడుగదా!



# రెండవ ప్రకరణము

## (అభయదానము)

అప్పుడే తెల్లవాఱుచుండెను. భానుఁడు తన సహస్ర కరచాలనముచేఁ, జరించు జారచోరులను భయము గొల్పు వానివలెను, సాధువుల బుజ్జగించువానివలెను నుండెను. ఆతఁడు దుర్మార్గుల దురితములకుఁ గినియు చందమును సూచించు నరుణకాంతితోఁ బ్రకాశింపఁజొచ్చెను. పద్మినులు రాత్రియంతయు నినునిరాకకు వేచివేచి యుదయముననే యళిగానపూర్వకముగా నాహ్వానించుచు వికసితముఖపద్మ కపోలదళములై కాంతు లెగఁజిమ్ముచుండెను.

గుజరాతురాజ్యమున సంతాజీ యను గ్రామమొకటి గలదు. తత్పరిసరమున నొక విశాలగభీర తటాక మతిరమణీయమై కొండలసందునుండి యేర్పడి, ప్రకృతిమనోహరమై యుండును. అందలి నీరు పాంథులకు నారికేరసారమువలె నుండి మనస్సునకెంతయో యాహ్లాదమును గొల్పుచు శరీరాయాసమును బాపుచుండెను.

అట్టి కొలనిగట్టున, మాసినవియుఁ జినిఁగినవియు నగు వలువలతోఁ, దృఢాంగములతోఁ, పెరిగిన గడ్డములతోఁ, మలిన వేషములతో రోఁతఁగొల్పుచుండియు నాకర్షణీయమైన సహజ కళలు గలవారును, కటిలంబమానచంద్రహాసులు నగు నిరువురు క్షత్రియయువకు లుపవిష్టులై యుండిరి. వారి విషాదవదనములలో నంతర్భూతమైన

క్షాత్ర తేజము కప్పరానిదై మేఘములను జీల్చికొని వచ్చు మార్తాండ రేఖను బోలియుండెను. వారి సంభాషణలవలన వారు వాఘోజీ జితోజీ సోదరులని తెలియుచున్నది.

జితోజి॥ అన్నా! చీకటివెనుక వెలుతురు లోకసహజ మయ్యును మన కదృష్టభానూదయమే లేదుగదా! జవసత్వములు గలిగియు, అహమ్మదుషా మూల మునఁ బికిపందలవలె నైతిమిగదా! ఎన్నాళ్ళిట్లుందుము? మన దీనసోదరి నెన్నాళ్లు కాపాడఁగలము? ఈ వీని ధౌర్త్యము నెప్పు డరికట్టఁగలము?

వాఘోజి॥ తమ్ముఁడా! ధైర్యమూనుము. విపత్తులలో ధైర్యమె సంజీవివంటి మంత్రము. విధి మన నుదుట నెట్లు వ్రాసెనో యట్లు జరుగక తప్పదుగదా! నీవనినట్లు సోదరీవిషయమగు చింతమాత్రము నన్ను వేధించుచున్నది. సుకుమారియు, నుత్తమశీలయునగు నామె వైభవములనుండి తప్పింపఁబడినది. ఇట్లనేక రాజపుత్రీస్త్రీలు కష్టపడుచున్నారుగదా!

జితోజి॥ అన్నా! రాజులందఱేకమై యేల యాతని నాజిలో 'జితోఽస్మి' అనిపింపఁగూడదు?

వాఘోజి॥ పిచ్చివాఁడా! మన పరస్పరాసూయాభావములు, అన్యోన్యద్వేషములే మన భారతదేశపతనమూల ములగుచున్నవి. ఈ కారణముననే హైందవులకు నేడు అహమ్మదుషా నామము సింహస్వప్నప్రాయ

మైనది. ఆ కారణముననే వాని ధాటికి మనముగూడ నోర్వఁజాలక పోయితిమి. ఇది కాలమహిమ.

ఇట్లు వీరు చర్చించుచుండఁగా, నడేదారి నొక శకటము పోవుచుండెను. అందు బలశాలి, బంగరురంగుమేని వాఁడు, యువకుఁడు నగు వీరుఁడొక్కఁడు కూర్చుండియుండెను. ఆతనిమోమును చూచినతోడనే నిర్మలహృదయుఁడనియు, నిర్భీకుఁడనియు, నీతిమంతుఁడనియు, నితరుల కష్టములను సహింపలేని మెత్తనగు మనస్సుగలవాఁడనియుఁ దెలియును.

సేవకుఁడు శకటమును సారథియై తోలుచుండెను. బండి తటాకము గట్టువెంబడిఁ గల దారిని నాగుచుండెను. వీరిని సోదరులు గమనింపలేదు. కాని దూరమునఁగల వారి సేవకుఁడు గుర్తించి పాఱిపోయెను.

అప్పుడా నూతనపురుషునిఁజూచిన శకటసారథి 'ప్రభూ! పాఱిపోయినవాఁడు విప్లవకోటిలోనివాఁడు గాఁబోలును! కానిచో ఆ విధమున భీతిల్లి పరుగిడనేల? కావున నాకు భయముగానున్నది. శీఘ్రము యీ స్థలమును విడుచుట మేలు' అని బొంగురుపోయిన కంఠముతోను, వణఁకుచున్న శరీరముతోను వచించెను. అప్పుడా వీరపుంగవుఁడు మందహాసమొనరించి 'భయములేదు; ఎవఁడో దిక్కుమాలినవాఁడు కనఁబడినంతనే భయమెందులకు? విప్లవకోటిలోనివాఁడందువా? నేటి విప్లవపురుషులు రాజపుత్రులే గదా! గతిలేని వాథోజీసోదరులవంటివారే గదా! కాని వీరియందు

నావంటి వీరుఁడొకఁడున్న యెడలఁ క్రూరుఁడగు అహమ్మదు షావలనఁ గోల్పోయిన భూములను రెండుదినములలోఁ బొంద కుందురా? భీరుత్వముచేఁగాదా. ఇట్టి యవమానములను భరించి యడవులలో హర్తలవలె, మృగములవలెఁ, గిరాతులవలెఁ దిరుగుచున్నారు.' అని నుడివి బుజ్జగించి భయము దీర్చెను. అయినను బండివాని భయము పోలేదు. అప్పు డా చాయ నెవ్వరో పోవుచున్నట్లు తోఁచెను. దానితో ద్విగుణీకృతభయముతో శకటమును శీఘ్రముగాఁ దోలుటకు వాఁడు ప్రారంభించెను.

పాఱిపోయిన వాథోజ సోదరుల సేవకుఁడే యట్లు పొంచి సేవ్యసేవకుల సంభాషణము వినినవాఁడు. అతఁడు ప్రభుభక్తి పరాయణుఁడు. వారి వాక్కులు కర్ణరసాయనముగఁ దోఁచుటచే నతఁడీ విచిత్రసంభాషణమును దన యజమానులకుఁ దెలుపవలెనను నుత్కంఠతో నతి త్వరితగమనమునఁ దటాకతీరమును జేరెను. అప్పటి కా యన్నదమ్ములు సరోవరజలములో కరచరణ ప్రక్షాళనమును గావించికొనుచు సేవకునికొఱకై యెదురుచూచుచుండిరి.

సేవకుఁడే తెంచి యావద్వృత్తాంతమును పూసగ్రుచ్చినటుల విన్నవించెను. వాని వాక్యములువిని వారాశ్చర్యచకితులై 'పోఁగొట్టికొనిన సంస్థానము రెండుదినములలో నెట్లు పునరార్జనము చేయఁగలఁడు? ఇది దంభవాక్కు' అనుకొనిరి. మరల ఆశ ప్రేరేప 'ఆహా! మన కదృష్టదినములు రానున్నవి కాఁబోలు! బాగుపడినచో ఆతనివలననే బాగు

పడవలెను' అని యనుకొని యా నూతనపురుషవాక్యము లచే నిను మయస్కాంతముచే నాకర్షింపఁబడినట్లు కర్షితులై వాయువేగమున శకటముపోయిన తెన్నున హుటాహుటి నడలను జనిరి.

అట్లు చనిచని యాతనిఁ బొడగాంచి యభివందన మాచరించి కులగోత్రనామములను దెలిపికొని, తమ దీనచరిత్రను విన్నవించి 'మహాత్మా! మీ రీ దీనాత్ముల విన్నప మాలించి మా యాతిథ్యము స్వీకరింప విచ్చేయుఁడు. మమ్ము ధన్యులఁ గావింపుఁడు' అని ప్రార్థించిరి.

ఆ నూతనపురుషుఁడు వారి నయవినయముల కచ్చెరువంది సాటిరాజపుత్రులకోర్కికి వ్యతిరేకముగఁ జరించుట గౌరవలోపముగ భావించి వారి యాతిథ్యమున కామోదించి వారితోఁగూడ పోయెను.

ఆతిథ్యసమయమున వారు తటినెఱిఁగి నూతనాగంతుకునిఁగూర్చి వినయముతో నిట్లని పలికిరి: 'ఆర్యా! మా చరిత్రమంతయుఁ దెలిపితిమి. మే మనేక కష్టములకు లోనై యున్నారము. మా సోదరి మిగుల సుకుమారియయ్యు మాతోఁగూడ ననేకయాతనల ననుభవించుచున్నది. సాటి రాజపుత్రివీరులరగు మీరు, సోదరరాజపుత్రి కాదీన దశను జూచియైన మమ్ము కనికరింపవలెను. మీరు రెండు దినములలో మాకు పూర్వవైభవము వచ్చునట్లు చేయఁగల నని పలికినటుల మాభృత్యుఁడు వచించినాఁడు. ఆ పరాక్రమము మీకడ నున్న దనియే భావింతుము. ఏమనఁగా, రాజ

పుత్త్రిలు వ్యర్థముగా వాగాడంబరము చూపరుగదా! అట్టి మీ ప్రతిభాశక్తులను సాటిరాజపుత్త్రిల మగు మమ్మాదరించుటకై వినియోగించి భగవదాశీస్సులకుఁ బాత్రులగుదురని విశ్వసించుచు సహాయమునకై వినయాంజలులతోఁ బ్రార్థించుచున్నాము.'

ఈమాటలు వినినంతనే ప్రఫుల్లహృదయారవిందుఁడై యాపురుషుఁడిట్లనియె: 'మీసేవకుని వాక్యములయందు వీసమైన నబద్ధములేదు. అట్లు మాట్లాడిన నా మాటలయందు కించిత్తయినఁ బొల్లులేదు. అహమ్మదుషా దుష్కృత్యములు సహనాతీతములు. ఈ ఉకోజ వ్యర్థప్రలాపిగాఁడు.'

అట్లతఁడు పలుకగనే యంతకుఁబూర్వమే ఉకోజీ శౌర్యగాథ లనేకములు విన్న సోదరు లాశ్చర్యసంభ్రమానందములు ముప్పిరిగొన నాతని భక్తిగౌరవములతోఁ జూచి 'వీరపురుషాగ్రణీ! మీ రాకచే మేము ధన్యులము. మీ యుదారతానౌకావలంబనమూలమునఁ గట్టెక్కఁ దలఁచితిమి. మమ్ముఁ జరితార్థులఁజేయుము. మాతో అహమ్మదునగరమునకు విచ్చేయుము. సహాయపడుము. అభయమిమ్ము' అనిరి. అంతతో నాఁగక, 'రాజపుత్త్రినరేణ్యా! దేశము పేరున, రాజపుత్త్రికారక్షణము పేరున, మిమ్ము మేము ప్రార్థించుచున్నారము. ప్రార్థన మంగీకరింపుము. మనమందఱ మేకీభవించి నవాబు ప్రాణమానధనముల విధ్వంసమొనరించి ధర్మదేవతా ప్రతిష్ఠాపనము చేయవలెను' అనిరి. అంత ఉకోజీ 'అట్లే వచ్చెదను. మీ క్షేమమునకై నడుము

గట్టెదను. లాలాబాయికొఱకు నితరరాజపుత్త్రికల రక్షణా
రము వీరవ్రతకంకణముగట్టికొనెదను. కాని, మీకు నిలువ
నీడ గలిగిన తక్షణముననే మిమ్ము విడిచిపోయెదను.' అని
గంభీరనీరదారవమునుబోలు వాక్యగర్జనము ఘనుఁడగు
నాతఁడొనరించెను. సోదరులు మయూరములవలె సంతోష
ప్రపుల్లహృదయారవిందులైరి. వారు కేలుమొగిచి జయ
జయధ్వానములు పొనరించిరి.



# మూడవ ప్రకరణము

## (నవాబు అంతఃపురము)

అహమ్మదుషా అంతఃపుర మతివిశాలము. అత్యంత రమణీయము. యవన శిల్పము పారముఁగన్న మహత్తర కళాకౌశలముల కాటపట్టు. మరకతపు టాలు, స్ఫటికపు శిలలు మొదలగువానిచే నత్యంత మనోహరముగ నిర్మింపఁ బడిన సౌధములు, నుద్యానవన చిత్రములు, తదంతర్గత వేదికలు పెక్కులు గలవు.

అందం దక్కిసలముల మయూరములు తమ యందంపుఁ బురులవిప్పి కనులపండువుగ మనోహరముగ నాట్యముంబొనరించుచుండును. వాని సౌందర్య రేఖలు స్వచ్ఛదర్పణసదృశములగు ప్రదేశములఁ బ్రతిబింబితములై ద్విగుణీకృతశోభను గూర్చుచుండును.

అందొకచో ప్రసుందరమైన యొక చలువఱాతిన్నె గలదు. దానికి నలువైపుల మణిమయ స్తంభములును, వానికిఁ గట్టఁబడిన పచ్చల జాలరులును గలవు. అచ్చట వానియందు కళానైపుణ్యాతమిూఱఁ గెంపులు చెక్కుటచేఁ బచ్చని నునుసోగ దీవియలనడుమఁ గెంబట్టు కాషాయరంగు రంగుగల మందారపుష్ప గుచ్ఛములను గూర్చినట్లు విభ్రమవంతములై కాంతములై యుండెను. ఉపరిభాగమంతయు నత్యంత మనోహరమగు అచ్ఛపీతాంబరాచ్ఛాదితమై యుండెను. అయ్యది వజ్రఖచితమై, రత్న ప్రశోభితమై ప్రకాశించుచుఁ

దారకానికాయ సమలంకృతమగు నభ్రపథమును బోలి యుండెను. ఈ వేదిక ప్రత్యేకముగా నవాబునకై గల్పింపఁ బడుటచే నత్యంతమనోరంజకమై యున్నదనుటలో సందియములేదు. కూర్చుండఁదగిన క్రింది భాగమంతయుఁ జంద్రకాంతశిలానిర్మితమై మనోహర కళావైదగ్ధ్యసూచక చిత్రలేఖనములతో నొప్పారుచుండెను. దానిపైఁ జిత్రవిచిత్రవర్ణ చిత్రకళాశోభితరత్నకంబళములు గప్పఁబడియుండెను. దాని మధ్యభాగమునఁ దూర్పుదిశగా నొక విశాల సువర్ణపీఠము గలదు. దానిపై నొక పచ్చని పట్టుపాన్పు పఱువఁబడియున్నది. అడ్డముగా పొడవైన సన్నని రెండు దిండులు కూడ గలవు. ఆ పాన్పుమీఁద నొఱఁగి హుక్కా త్రాగుచు నవాబానందపరవశుఁడగుచుండెను.

ఈ వేదిక నానుకొనియే యతి విశాలమైనదియుఁ గళాకలితమైనదియు నగు విశాలమందిరముగలదు. ఒకచో వీణియలు మీటు నీటుకత్తియలు, నింకొకచో రాగాలాపములుచేయు పాటకత్తెలు, వేఱొంకస్థలమున మృదంగమురజాదివాద్య నిపుణమతులు, రంభాద్యప్సరఃకాంతలఁ దలఁదన్ను విభ్రమరేఖలుగల యందకత్తెలు గలరు. మందిరమధ్య విశాలప్రదేశమున దేవకాంతలవలె నృత్యాభినయాదుల తాళులఁగరఁగించుగానముచే తేనె చెవికింపుఁగూర్చు వెలపడంతుకలు గలరు. స్ఫటికశిలానిర్మితములు, రత్నఖచితములునైన కుడ్యములుగల యీ మహలునకుఁగల ప్రోన్నత స్తంభములు హైమజలముల పోఁతచేఁ దళతళలాడుచుండెను. అందు నవ

రత్నచిత్రిత పుష్పప్రముఖ శిల్పములుగలవని వేఱుగాఁ చెప్పఁ బనిలేదు. అందం దందముగా పూలగోలెము లమర్పఁబడి యుండెను. ఉపవిష్టులగు జనుల శ్రమాపనోదార్థము వింజామరలు విసరు యంత్రంపు బొమ్మలు గలవు.

అతిరమణీయ ప్రదేశమునఁ బైఁజెప్పఁబడిన వేదికాస్థలినిఁ గల హైమపీఠికా మధ్యభాగమునందలి పట్టు పాన్పుపై విశ్రమించిన నవాబు, మద్యపానదోషముచే, వ్యసన పీడనముచే నున్మాదివలె ధీవరులకుఁగాన్పించియు, శృంగార ప్రియులకు దేవేంద్రుని జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను. అతఁడు నడుమ నడుమ తన కుటిలేక్షణములను వారిపైఁ బఱపుచు హుక్కాఁ ద్రాగుచుఁ దలయూఁచుచు నానందపరవశుఁడై యుండెను.

అది కేవల వినోదసమయము. అట్టివేళ నాకస్మికముగా మహారాజ్ఞి జహానారా బీగము విచ్చేసెను.

ఆమె గంభీరమనోహరరూపము సదృశరహితమనినఁ జాలును. నాతిదీర్ఘమగు సన్నని శరీరము, దేవతాంగనలకుఁబోలు నందమామెకడఁ గలదు.

వచ్చిన యర్ధాంగిని గమనింపక, నవాబు యథాప్రకారము తన వ్యసన వినోదములఁ దేలుచుండెను. సుందరాంగు లొసంగు మద్యమును మధ్య మధ్యను గ్రోలుచుండెను. ఇది క్రొంగ్రొత్త నడవడిగాకున్నను సాధుశీలయు, వ్యసనదూరయు, భర్తృసేవారతయు, దేశభాగ్యరచనాసక్తయు, గంభీరయు, రాజసస్వభావయు నగు మహారాజ్ఞి

కియ్యదియెల్ల రోఁతకుఁ గారణమయ్యెను. నవాబుయొక్క యున్మత్తవిలాసలోలతకు మిగులఁ జింతించెను. ఇంకను నాతఁ డీ దెసఁ జూడలేదు.

అట్టి యాదృశ్యము సహింపరానిదయ్యు, శాంత మూర్తి భర్తను సమీపించి, 'ప్రభూ' అని వీణాస్వనమును బోలు కంఠస్వరముతోఁ బిలిచెను. అందు జాలి, ప్రేమ, భక్తి మిళితములై యుండెను.

అహమ్మదుషా యాపలుకులు విని, యులికిపడి తన రాణినిఁ గాంచి యాహ్వానించెను. ఈతనియం దొక సుగుణము గలదు. తనయం దెట్టిలోపములున్నను నెంత భోగపరాయణుఁడైనను జహానారాబీగమునం దితనికి గౌరవప్రేమలు సంపూర్ణముగా నుండెను. ఆమె మేధాశాలిని యనియు, నుత్తమగుణఖని యనియు నాతఁ డెఱుంగును.

ఆమె భ్రూభంగసంజ్ఞామాత్రమున నందలివారెల్లరు వెడలిపోయిరి. రాజకీవియన నయ్యదియేగదా!

అప్పు డామె యాతని పర్యంకమున నుపవిష్టయై యా సురాపరిమళము నోర్వఁజాలనిదయ్యు సహించికొనుచు 'ప్రభూ! అఖండమండలాధీశ్వరులును, ప్రజ్ఞాధురంధరులు నగు మీకిదియేమి? సురాపానము వదలరాదా?' అని పలికెను. అప్పుడు నవాబు "ప్రేయసీ! ఇది నాకు వశమా? దీని ప్రభావమును దెలియక నీవిట్లనుచున్నావు. ఒకసారి నీవిది సేవించినచో మరల వీడఁజాలుదువా? కొద్ది చవి చూడుము. నామాట లన్నియు విందువుగాని, యీవిషయ

మునమాత్రము నామాట మన్నింపవేల? నీవే, దీనిమహిమ స్వయముగాఁ గనుఁగొనఁజాలుదువు.'' అని పలికి మధు పాత్ర నందిచ్చెను. ఆమె దోసియు సగౌరవముగ సవిలాస ముగ దానినందికొని, క్రిందఁబెట్టి, దుర్వాసన నెట్లో భరించి కొనుచు దరహాసముతో, ''ప్రియా! నేనిది సేవింపఁజాలను. క్షమింపుము. నాదొక విన్నప మాలింపుము. పాలనాదక్షుల రగు మీరే యిట్లు గావించిన మీకుఁ దెలుపువారెవ్వరు? ఎల్లప్పు డంతఃపురమునందే కాలక్షేప మొనర్చుచుండుటచే రాజ్యాంగము లెట్లు జరుగును? బిడ్డలవంటి ప్రజలకష్టము లెవ్వరు తీర్పఁజాలుదురు? వారెంత వంతలపాలగుచున్నారో విలాసతత్పరులై మీరు కనుఁగొనఁ జాలకున్నారు. దుర్మా ర్గులగు దోపిడికాండ్రచే దేశమంతయుఁ గొల్లపోవుచున్నది. రాజ్యములో కలకల మెక్కుడుగానున్నది. దానిఁ గొంచె ముగానైనఁ జెవులఁబెట్టకయున్న నెటుల? ఆ ప్రజాసంక్షో భము లడంచు తెరువులు పరికింపుఁడు. నామాట వినుఁడు. త్వరపడుఁడు. ప్రభూ! కానిచోఁ బాలనాసమస్య నేటికంటె క్లిష్టతరమై రాజ్యము మఱియు క్షీణదశకు దెచ్చును. విప్లవ ములు వృద్ధిచెందును. అప్పుడేమి చేసినను ప్రయోజనము లేదు. కరతలములు కాలినవెనుక నౌషధపర్ణములు విట్టికొ నిన నేమిలాభము? మహాప్రభువులరగు మీరే యిట్లుపేక్షిం చినచో మనలనమ్మిన ప్రజలయొక్కయు, దేశముయొక్కయు గతియేమి? ఇటుపై పరతరుణులఁ జెనకఁబోకుఁడు. ఇది సర్వ విధ్వంసకారియగుదారుణచర్య. సామ్రాజ్యసౌధ స్తంభములు

సడలిపోవుటకుఁ బతనమగుటకు నియ్యది పిశాచమంత్రము గాదా! ఈ మంత్రజపము మనకేల? కొంచెము గమనింపుఁడు! మతమర్యాదల నిలువఁబెట్టుఁడు. మహమ్మదీయులను జూచిన కన్నులతోడనే హిందువులను దిలకింపుఁడు. అహో! వారి యాక్రందనధ్వనులు గుండియలు పగిలించుచున్నవి. మీహృదయము పాషాణముగాదు. ఇది నేనెఱుఁగుదును. వారి రోదనములు మన యభ్యుదయచ్ఛేదనములు. మీరు మేధావంతులరుగదా! మీకు నేను ప్రబోధింపఁగలుగుదానను గాను. కాని, మీరు నాకిచ్చిన చనవుచేతను, మీకర్ధాంగి నను భావముచేతను, నాకర్తవ్యమిదియ యను నమ్మకముచేతను నిన్ని పలికితిని. తప్పుఁబట్టకుఁడు. ఈమందప్రజ్ఞురాలిని క్షమింపుఁడు! బాగుగ నాలోచించి యుక్తాయుక్తములఁ దెలిసికొనుఁడు. పత్నీవిధ్యుక్తధర్మమ్మును మాత్రమే యిటుఁగావించితిని. 'నవాబు కామి; రాజ్యపాలన యెఱుఁగఁడు; భోగప్రియుఁడు; వ్యసనలోలుఁడు' అని లోకము తలఁచునప్పుడు మనకీయవమానము దుర్భరముగాదా! శత్రురాజులు తేలికగాఁజూడరా! దానఁ గీడుమూఁడును గదా! అతినిర్మల ప్రవర్తన మనంత సౌఖ్యప్రదసౌధసోపానపంక్తి యని యెఱుఁగరా'' అని మృదూక్తులతో మందలించెను.

కాని యిది యేటి కెదురీత. ఎడారిలోని వాన. జాడ్యగ్రస్తునకుఁ బథ్య మపథ్యమగునట్లు అహమ్మదుషా కివి రుచింపవయ్యెను. ఈచెవినిదూరి యాచెవిలోనుండి వెడలెను. మొదట చెవిలోనైన దూరకుండునుగాని, ప్రేయసీ

వాక్యములుగావున దూరినవి. తనకిష్టములేనివి గావున జాతినవి. అనంతర మాతఁడు తనకు దాఁపునఁగల చేటినిఁజూచి మధుపాత్రిక నిమ్మని యాజ్ఞాపించెను. కాని బీగమువలని భయముచే నది యందీయ లేదు.

బీగ మీాస్థితినిఁ గాంచి 'దైవము బలీయము' అనుకొని యుచితజ్ఞయై దుఃఖమునాపికొని, తన వచ్చినకార్య మాతనికిఁ దెలుపనెంచి 'ప్రభూ! సిద్ధీఫకీరుసమాధిని దర్శించుటకు రానున్న శుక్రవారము మీాసెలవుపై వెడలెదను.' అనెను. అతఁడల్లే 'నీయిష్టము. నాయిష్టములకు మాత్ర మడ్డు దవ్వుఁకము' అనెను.



# నాలుగవ ప్రకరణము

(ప్రయాణము)

మహారాజ్ఞి జహనారాబీగము రాజపుత్త్రి సరదారులలోఁ బేరెన్నికఁగన్న జగత్సింగునకు ముద్దులపట్టి. ఈమె బాల్యనామము ప్రతిమాదేవి. పోఁతపోసిన బంగారుప్రతిమవలె నీమెయుండుటచే పెద్దలారీతిని బిలుచుచుండిరి. అదియే స్థిరమయ్యెను. అహమ్మదుషా ఆమెజనకుని రణరంగమున నోడించి హతునిఁబొనరించి రాజ్యముతోపాటి బాలికనుగూడ తెచ్చి మహమ్మదీయాంతఃపురములోఁ బెరుగునట్లు చేసెను. క్రమముగా నీడేటి పెద్దదయ్యెను. అబలలకు సర్వాపదలకు మూలమైన పాడుజవ్వన మంకురింపఁగనే నీమె భయపడసాగెను. పితృవియోగము, మహమ్మదీయ మతప్రవేశము, బలాత్కారమునను ధారాత్రయముగల త్రిశూలముచే నీమె బాధితయగుటచే నవాబుముఖమునైనఁ గొన్నాళ్ళీమె చూడలేదు. కాని విధివిలాసమునఁ దుదకీతని రాణియయ్యెను. రాజ్ఞియైన వెనుక నీమె హైందవసంప్రదాయము ననుసరించి నైతికభంగము రాకుండ మహాసాధ్వియై వినుతి కెక్కెను.

మహమ్మదీయాంతఃపురమున నీమెకబ్బిన నూతననామము 'జహనారా.' ఈమె పూర్వనామము పెక్కురకుఁ దెలియదు. బురదనంటినను నవమృణాళిని యెట్లు తనశోభను వీడదో యట్లే యీమె మహమ్మదీయులయింటి కోడలయ్యె

హైందవోదాత్త స్వభావమును వీడక సుగుణనికరమున కాక రమై యాదర్శప్రాయమై ప్రకాశించుచుండెను. జహనారా బీగము దయార్ద్రమైచేసెడుగుప్తదానములకు లెక్కయేలేదు. భక్తులన్నను, పకీరులన్నను, యోగులన్ననునామె యెంతయు భక్తివినమ్రమై యుండును. గుణములకుఁదగినయందముగూడ నామెకు దైవ మొసంగియుండెను. ఆమెస్త్రీలతలమానికము. మోమునఁ బ్రశాంత గంభీర రాజీవి గలదు. రాశీభూత సుగుణఖని. ఇన్నియు నిచ్చట నేకస్థానమునఁ బ్రోవుగా నేర్పడి యుండుటచేత నవాబుయొక్క యగ్రమహిషీస్థానము నలంక రింపఁ గలిగెను.

ఈమె మహమ్మదీయులవలె మద్యపానమొనర్పదు. దుశ్చింతలు గావింపదు. నిష్కపటవతి. మనస్సు నవనవశిరీష పేశలము. ఎవరైనఁ గష్టపడినచో మనస్సు నవ్యనవనీతము వలె కరఁగిపోవును. భర్తృశ్రేయోఽభిలాషిణి గావుననే తన భర్తనెట్లయినను సన్మార్గమునకుఁ ద్రిప్పవలయునని తలఁచి, శీలవతులమానభంగము చేయరాదనియు, దేశద్రోహము తలఁపగూడదనియు, శతధా చెవి నిల్లుకట్టుకొని మృదూక్తు లతో భర్తను మందలించుచుండును. అయినను నీమె యత్నము బూడిదనుబోసిన పన్నీరగుచుండును.

అట్టి యీమె సుప్రసిద్ధుఁడును, సిద్ధిపొందిన మహనీ యుఁడు నగు సిద్దీఫకీరుసమాధిని దర్శించునిమిత్తము బయలు వెడలఁదలఁచెను. తన చెలుల కావిషయమును దెలిపి ప్రయాణ సన్నాహము గావించెను. నవాబామె రక్షణకై యైదు

వందల రథికుల నాయత్తపఱుప నాజ్ఞయిచ్చెను. రాజ్ఞియుఁ, దనయంతఃపురాంగనలు దగుపాలకులతో నరుదేరఁ బ్రయాణ సంభారములతోఁ దరలెను.

వారు రాచబాట నతిక్రమించునప్పటికి బాలభానూదయమయ్యెను. ఇంతలో దాఁటవలసినయడవిని చేరిరి. ఆ విపిన మతికరాళమైనది; అత్యంతదంతురమైనది. అది నిబిడ నిశాత కంటకతృణసంకీర్ణమైయున్నను, బాట తెలిసిన వారు దారికీయ బ్రయాణము సాగుచుండెను. మహోరగ భల్లూక శార్దూలాదిభయంకర జంతుసంతానమున కయ్యది నివాసగృహము. సహజచుంబితగగన ప్రదేశములగు భూరుహములు పెక్కులుగలవు. అచ్చటచ్చట వెదురుపొదలు గాలిరాపిడిచేతఁ బొనరించుశబ్దములు,పక్షుల కిలాకిలారావములు విననగుచుండెను. రాత్రియరుదెంచెను. రేయియంతయు నొక విశాలప్రదేశమున విడిసి ప్రయాణము నాపికొనిరి. ఆ నిశి నిశ్శబ్దగభీరమై నిస్తుల్యమగు పరమేశ్వరప్రకృతివిలాసమును విస్పష్టపఱచుచుండెను. కాని యప్పుడప్పుడు వనగజముల ఘీంకృతులు, సింహశార్దూలముల హుంకృతులు విననగుచుండెను. సాధారణముగా ఆత్రోవను నెవ్వరు పోవజాలరు. సైన్యసమేతయగు రాజ్ఞి గావుననే యీయడవిని దరింపఁగలిగి యుండెను.

ఆరాత్రి యచ్చటవిడిసి వేడుకగాఁ బరివార మానందించుచుండెను. ఫకీరు మహిమలనుగూర్చి సైనికు లొకచోటను, జహనారాబీగము తనచెలికత్తెలతో నొకచోటను

మాట్లాడికొనుచుండిరి. మహాత్ముల చరిత్రము లద్భుతములే గాక భక్తిప్రదములై మానవలోకమును బునీతము చేయు చుండునుగదా!

వేకువజాము వేళయగుడు బ్రస్థానము సాగెను. అరు ణోదయమగునప్పటికి నిరపాయముగ గమ్యస్థానమును చేరిరి.



# ఐదవ ప్రకరణము

## (రాజ్య లబ్ధ్యుపాయము)

అహమ్మదుపానగర మతిరమణీయమైనది. అచ్చటి సౌధము లత్యున్నతములు. అందనేక ప్రాచీనభవనములు పూర్వపు టౌన్నత్యమును సూచింపుచుండెను. ఎటుచూచినను జనసమ్మర్దకోలాహలములే! గొప్పధనవంతులగు నచ్చటి వర్తకులు దుర్లభవస్తుసముదాయములను నంగళ్లలో సర్వసామాన్యవస్తువులవలె విక్రయించుచుందురు.

ఆనగరమునకుఁ జుట్టును బలిష్ఠము నున్నతమును నగు అరిదుర్భేద్యమగు ప్రాకారమును, నగాధమగు కందకమును గలవు. ఆ లోతైనయగడ్త నీటియందు పంకజముల సోయగము నీలాంబరమునందలి తారకాగుచ్ఛములవలె నేత్రానందకరముగా నుండెను. ఆ పట్టణప్రజలయొక్క రాకపోకలకుఁ జతుర్దిశలఁ జతుర్ద్వారములుగలవు. కాని సాధారణముగా సింహద్వారమగు తూర్పువాకిలియే తెఱువఁబడియుండును. ఇంద్రపురమున నొకనందనవనమునకే యబ్బురపడువార లీ నగరమున దానినిఁ దమయసామాన్యశోభచేఁ దిరస్కరింపఁజాలునుద్యానవనములనుజూచి యాశ్చర్యపడకమానరు. సౌధములు బారులుతీఱియుండును. బాటలు విశాలములు. అచ్చటచ్చట వలయుచోటులయందు ప్రజోపయోగార్థముగ ఫలవృక్షములు, తీయని నీటికొలఁకులు గలవు.

అట్టి యామహానగరమునందు పశ్చిమదిశగా నొక సందులో నొక పెంకుటిల్లుగలదు. అది మిగులఁబురాతనమైనది. నడిరేయినిరువురు స్త్రీపురుషు లందు సంభాషించుచుండిరి. వారితీరునుబట్టిచూడ నయ్యది రహస్యసంభాషణగా నుండెను.

పురుష॥ ఏమి, నిజమా! అంతటిభాగ్యమా!

స్త్రీ॥ నేనుచెప్పునది యబద్ధమెట్లగును? నీ ప్రేమఁబడయఁగోరియేకదా బీగముయొక్క అంతఃపురమునఁ బరిచారికగాఁ జేరితిని! అంతయు నీదయకేగదా!

పురుష॥ నీవు చాలశ్రమపడితివి. చతురా! నీనామము సార్థకమైనది. నీమేలు మఱువఁజాలను.

ఈమాటలతో ఆపరిచారిక యుబ్బిపోయి మరల నిట్లు పలికెను: "అంతమాత్రము కృతజ్ఞతయున్నఁజాలును. అది యెట్లుఘటిల్లునో వినుము. నవాబు నిరంతరవ్యసనలోలుఁడు. నిన్నునాతఁడు వ్యసనవినోదమైయుండు సందర్భమున బీగము వచ్చి యాతని కెంతయో ధర్మప్రబోధము గావించెను. లాభము లేకపోయెను. శుక్రవార ముదయమున సిద్ధిషకీరు సమాధి దర్శనార్థము మహారాజ్ఞి సిద్ధేడ్రగ్రామసన్నిధినిగల ముకర్బో గ్రామమునకుఁ బోవనున్నది. పోవనుండుటయేమి? ప్రయాణమైనది. ఇది మీయజమానులకార్యమున కనుకూలకారియేమో! అయినను ఆమె పుణ్యాత్మురాలు. సాధ్వి. ఆమె కపాయమునుదలపెట్ట నాకిష్టములేకున్నను నీ ప్రణయమునకై యింత నీచత కొడిఁగట్టితిని. ఆమె యీ ప్రయాణమునకు

నవాబునాజ్ఞఁబడయునప్పుడు వానికి మధుపాత్ర నందిచ్చు చుంటిని. ఈప్రయాణము మనభాగ్యమే యనవచ్చును. మనప్రభువుల కియ్యది లాభకారి గాఁగలదు. అందుమూల మున శాశ్వత పారితోషికములనంది సుఖముగా భావిజీవితము గడుపవచ్చును. ఇప్పుడే పోయి తెలుపవలయును. విళంబ నమునకు వీలులేదు. పండ్రెండుగంటలైనది. ఇచ్చటికి సిద్ధి సమాధి చాలదూరము. రేపురాత్రికైనను నచ్చటచేరవలెను గదా! రాజ్ఞీమణి శుక్ర, శని, యాదివారము లచ్చటనే యుండును. కావున నీలోపునఁ గార్యములు నిర్వహించి కొనవచ్చును.'' అనెను.

పై సంభాషణబట్టి వీరు వాథోజీజితోజీల చారవర్గ ములోనివారని తెలియుచున్నది.

ఈవిషయము కొలదినిమిషములలో వాథోజీ సోదరుల కు, నుకోజీకి, వారిమిత్రుఁడగు బలవంతసింగునకుఁ దెలియఁ జేయఁబడెనని వేఱుగాఁజెప్ప నక్కఱలేదు.

అంత నుకోజీ వాథోజీసోదరులతో నిట్లనెను: ''సోదరు లారా! దైవ మనుగ్రహించినాఁడు. ఈతరుణమును బురస్క రించుకొని రక్తపాతములేకుండ సులభముగాఁ గార్యము సానుకూలము చేసికొనవచ్చును. అపహృతరాజ్యము సులభ ముగా పునర్లభ్యముగాఁ బొనరించికొనఁగలము. ఈదినము వేఁకువనే సైన్యముతో రహస్యముగా వెడలినచో శనివార ముదయమునకైనను మనము సిద్ధీఫకీరుసమాధిగల తోఁటకుఁ జేరఁగలము. అయిదువందల రథికులతోమాత్రమే రాజ్ఞీమణి

ప్రయాణమని వింటిమిగదా! ప్రస్తుతము మనకెటుగలవారు నాలుగువందల కెక్కుడులేరు. కావున సమాధిస్థలమున రహస్యముగా దాగియుండి యామె పూజాసమయమున బంధింపవచ్చును. ఆమెసైన్యము వెలుపలనుండును గావున ఆమె పాటులు వారు గుర్తింపరు. ద్వారప్రదేశమున వారిని నిరోధించినచో నైదువందల సైనికులనేగాదు, అయిదువేల ప్రబల వాహినినిగూడ నడ్డుపెట్టగలము. అనంతర మామె బంధన కారణముగా రాజ్యము మిమ్ముఁజెందును. ఇంతకుమించిన తరణోపాయము గాన్పింపదు. అయినను స్త్రీజనగౌరవమే ప్రాణముగాగల రాజపుత్త్రులముగావున నామె కెట్టి గౌరవహానియు జరుగకూడదు. ఇంతకన్న మంచియుపాయము మీకుఁదోచినఁజెప్పుడు" అనెను.

అందఱు నేక గ్రీవముగా నీయుపాయమే బాగుగ నున్నదని పలికిరి.

# ఆరవ ప్రకరణము

## (జహనారా ప్రతిజ్ఞ)

ముక్కోర్బా గ్రామము చిన్నది. పూర్వమిది గొప్పపట్టణ మని సూచించు మహమ్మదీయుల జీర్ణసౌధము లెన్నియో గలవు. కట్టడములుమాత్రము పూర్వశోభనింకను సడలి యుండలేదు. ఈ గ్రామమున నన్నియు మహమ్మదీయకుటుం బములే. ఇతరవర్ణము లచ్చట నివసింపవు. ఒండు రెండిండ్లుం డినను వారి బ్రతుకు పాముపడగక్రింది కప్పలవలె నుండును. ప్రతిశుక్రవార మిచ్చట ఉత్సవముజరుగును.

ప్రతిమాసమున నొక్క శుక్రవారమున జహనారా బీగ మిచ్చటికి వచ్చుచుండును. అహమ్మదుషాపై నెక్కు రకుఁ గోపముండినను నీమెను దేవీతుల్యగ హైందవులు దలఁ చుటచేత నీమెజోలి కెవ్వరుబోరు. ఈమెయే యహమ్మదుషా యంతఃపురమున లేనిచో హైందవుల పాట్లింతకు శతభంగుల నెక్కుడుగానుండునని వారెఱుంగుదురు. యథాప్రకారము నేడు కొంతపరివారముతో బీగమువచ్చెను. పవిత్రమగు మసీదులోనికి సాయుధులగు సైనికులఁ దీసికొనిపోవు నాచార ములేదు. అందువలన నామె యెప్పటియట్లనే తన పంచశత భటావళిని మసీదున కావలివాకిట రెండుఫర్లాంగుల దూర మున విడియించెను. ఏమన, నయ్యది విశాలమగు మైదా నము. తన సేవకులతోను, తన సేవకురాండ్రతో నలుగురు అంగరక్షకులతో జహనారాబీగ మతిభక్తితో లోనికేగెను.

ఆమసీదు విశాలమైనది. ఎంతయో పురాతనమైనది. అందు పేరెన్నికగన్న మహమ్మదీయుల సమాధులనేకములు గలవు. దేశమునకై ప్రాణత్యాగ మొనరించిన భటులయొక్క వైహిక శేషములు వహించినవియు, భక్త్యావేశపరులై మానవ కళ్యాణము నర్థించుచుఁ బాటుపడినఫకీరుల శరీరములను గర్భమునఁగలవియు, నిరంకుశరాజ్యపరిపాలనముతో వికట మతితో నయఃపాదుకలతోఁ బ్రపంచమూర్ధమున నడ యాడిన ముసల్మానుప్రభువుల యస్థిశేషములతోఁగూడి చరి త్రమాత్రావశేషములై స్పృహణీయములై విస్మృతికెడమీక నిలిచినవియునగు ననేకములగు కట్టడము లందుగలవు.

రాణి వానినన్నిటిని భక్తిశ్రద్ధలతో గమనించుచుండెను. శుక్రవారము గడచినది. నేఁడు శనివారము. నేఁడు మరల రాజ్ఞీరత్నము ద్విగుణితోత్సాహముతో వర్తించెను. ఆమె మనస్సానందవారిధిలో భక్తితన్మయతలో మునిఁగియుండెను. ఆ మసీదంతయు నగరుధూపముఖ్యవాసనలచే భక్తులను పారవశ్యమున ముంచుచుండెను.

బీగమతిభక్తితో సిద్ధిఫకీరు సమాధికిఁ బ్రదక్షిణమాచ రించి పుష్పములతో నలంకరించెను. హైందవసంప్రదా యానుసారము సాష్టాంగనమస్కృతు లొనరించెను. దుర దృష్టవశమున మతభ్రష్టత ప్రాప్తించినను ప్రాక్తనవాసనలు బలీయములుగదా!

ఇంతలో నుస్రోజీసైనికులు చతుశ్శతసంఖ్యాకులామెకు నలువైపులఁ గ్రమ్ముకొనిరి. ఈ యకాలప్రళయమునకు

నిర్మేఘవజ్రపాతమునకు నామె యాశ్చర్యచకితయయ్యెను. ఇంతలో ఉక్కోజీ యెదుట కేతెంచి సైనికులను గనుసన్నచే ద్వారదేశమున నుండ నాజ్ఞాపించి, వినయపూర్వకముగ నభివాదన మొనరించి 'అమ్మా! మమ్ము క్షమింపుము.' అనెను. రాణి తలయెత్తి నిదానించి చూచెను. ఎట్టయెదుటనున్న వ్యక్తి గంభీరుఁడు; ఆజానుబాహుఁడు; రాజపుత్రయువకుఁడు. ఆమె యుదాత్తగంభీరస్వరమున నిట్లనెను: 'అయ్యా! నీవెవరు? ఈ వ్యాపారమేమి? నేనేమి యపకార మొనరించితిని?'

ఉక్కో॥ నేనొక సామాన్య సంస్థానాధిపతినగు ఉక్కోజీయనురాజపుత్రుఁడను. నాపూర్తినామము ఉక్కోజీబండార్కరు. నీవు మాకెట్టి యపకారము చేయలేదు. సరేకదా! నీమూలమునఁ గొంతవఱకైన దేశమభ్యుదయమును బొందుచున్నదని చెప్పఁగలను.

రాణి॥ మంచిది. అట్లయిన నన్నేల బంధింపఁజూచెదవు?

ఉక్కో॥ నీ బంధనము పరోపకారకారణమగును. అమ్మా! యిటుచూడుము. వీరిరువురును నీభర్తచే జోగులుగా చేయఁబడినవాఘేలీరాజపుత్రులు. వాఘోజీసోదరులు.

అని చూపెను. రాణికి వారు సభక్తికముగ నమస్కరించి తొలఁగిరి. అంత మరల ఉక్కోజీ యిట్లనెను: 'వారు నీభర్తచే నపహృతసర్వస్వులై యడవులఁబట్టి తమసోదరితోఁగూడఁ బెక్కిడుములఁగుడుచుచున్నారు. ఈ దేశమున సుప్రసిద్ధ రాజవంశజులగు వీరు నన్ను

శరణువేఁడగా నే నభయమిచ్చితిని. వీరికి శాసట గా బలవంతసింగు అను రాజపుత్రవీరుఁడు గూడ గలఁడు'.

రాణి॥ నీ పరోపకారబుద్ధికి సంతోషమే. కాని, యీ విషయమున నాభర్తతో సంప్రతించుటయో, లేక బహిరంగ యుద్ధ మొనరించుటయో, అటుగాక తదితర న్యాయోపాయములపై కార్యానుకూలతను జేసికొనుటయో యుత్తమోత్తమకార్యము కాని భక్తజనారాధనకై వచ్చిన యొక యబలను, నంతఃపురాంగనను రాజపుత్త్రుఁడనని చెప్పికొనుచున్న నీవు బంధింపఁజూచుట లజ్జాకరము, కులకళంకకరమగు నీచకృత్యముగాదా!

ఉకో॥ అమ్మా! నేను నీవనునంత నీచుఁడనుగాను. అధిక ప్రసంగినని నిందింపకుము. కాని కార్యము తప్పి వచ్చినప్పుడు రాజసతియనెడు కృత్రిమాస్త్రప్రయోగము రాజపుత్రులకుఁ గూడ ధర్మమే. స్త్రీజాతి యందు మాకు వలసినంత భక్తి ప్రపత్తి గలదు. నీయందు మాకు గన్నతల్లియందుగల భావముగలదు. నీ చరణదర్శనస్పర్శనములు మమ్ము పునీతులఁ బొనర్పగలవు. ఇది త్రికరణముల దైవముఖమును జూచి చెప్పువాక్యము—అడితప్పని యుకోజీపలుకు. నీ మూలముననే అహమ్మదుషా కొంతవఱకైన సంస్కరింపఁ బడుచున్నాఁడని నా విశ్వాసము. అయినను దేశ మింకను నధోగతిలోనే యున్నది.

నేను వీరికి వాగ్దానమిచ్చిన క్షత్రియుఁడనగుట చేతను, బలసాధనసంపత్తులు తక్కువగాగలవాఁడ నగుటచేతను, సామాన్యుఁడనుగావునను, నుపాయాంతరమున నిన్ను బంధించితిని. నిప్పుకొడిగట్టితి వని నాకుఁ దెలియును. కాని నీవు రత్నమువలె మమ్ముద్ధరింతు వను నమ్మకముగలదు. మసీదుద్వారము నెవరు వెలినుండి చొరఁజాలరు. నాభటు లా ద్వారసీమను నిరోధింతురు. నీ భటులలో నెవ్వరును నింకను నిచ్చటికి రాఁజాలరు. నిన్ను బందీగాఁ గైకొనినచో నవాబు దారికివచ్చును. ఈ దురదృష్ట సోదరులు తమ సంస్థానమును మరలఁ బడయగలరు. ఇట్టి కార్యసిద్ధికై యీ యకార్యకరణమునకుఁ గడంగితినిగాని నీపాదధూళి మూర్ధభాగమునఁ దాల్పఁ దగిన పుత్రిసదృశులమగు మేము నీయెడ ద్రోహము తలపెట్టలేము. అట్టిద్రోహము నిత్యము రాజపుత్రి స్త్రీలయెడఁ దలపెట్టువాఁడు నీ భర్తయే. ఘాలాఖుఁడు నేఁడు నాకెదురుగావచ్చినను నిన్ను విడిపింపఁ జాలఁడు.

రాణి॥ రాజపుత్ర! సరియే! మీకు నాయందు నమ్మకమున్నదా?

ఉక్రో॥ పూర్తిగా లేదు.

రాణి॥ కారణము?

ఉక్తో॥ నీభర్త భోగప్రియుఁడు. అతఁడు నీమాట వినునని తలం
పను. ఒకవేళ వినగలిఁగినను నీకు మాయందు సాదర
భావము గలదో లేదో! రాజపుత్రికల పవిత్రరక్తముఁ
నీశరీరమునఁ బ్రవహించుచున్నను నీవు ముసల్మానుల
కోడలవుగదా? కావున మాయం దాదరభావము
తప్పియుండవచ్చును. నొప్పించితినేమో క్షమింపుము.

రాణికిది నిశితశరాఘాత మయ్యెను. అయినను స్వాధీన మనస్కగావున నిట్లనెను:

'ఓయీ! మిక్కిలి చింతిలుచున్నాను. నీవు నన్నంత నీచగాఁ దలంపకుము. నా కులాభిమానమింకను సడలలేదు. శతసహస్రభవములకుఁగూడ నా వంశాభిమానము చ్యుతము గాదు. నా కులశీలములు పరిస్థితులమూలమున మంటలోఁ గలియఁగా మహమ్మదీయాంతఃపురకాంతనైనను సదా హైందవక్షేమమునకై పాటుపడుచుండుట కర్మసాక్షియగు పరాత్పరుఁడెఱుఁగును. ఒకవేళ నీకు నమ్మకము చాలనిచో వినుము. పవిత్ర మతగ్రంథమగు ఖురాన్ ప్రమాణముగా, భగవద్వాక్యమగు భగవద్గీతసాక్షిగా, నిచ్చట నదృశ్యుఁడై మహిమలఁజూపుచున్న సిద్ధీఫకీరు ఆత్మసాక్షిగా, నేనొక ప్రతిజ్ఞను జేయుచున్నాను. నీవు వచించిన ఈ రాజపుత్రిసోదరులకుఁ దిరుగ రాజ్యమిప్పింతును. అట్లు చేయఁజాలనినాఁడు నేనాత్మహత్యను గావించికొనెదను. సామ్రాజ్యదానమో, స్వాత్మప్రదానమో యేదియో యొకటి నిశ్చ

యము. ఇందొక్కటి జరిగియే తీరును. జహానారాబీగము పొల్లుమాటలు పలుకునదిగాదు.

ఈ వాక్యములతో నుకోజీవాఘోజీలు మిన్నంటిన యానందాబ్ధితరంగములుగలవారై యామెకు భక్తిపూర్వక ప్రణామము లొనరించిరి. వారి సంశయ మేఘములు యథాయథలై నశించెను. 'రాణికి జయమగుఁగాత' అని యుకోజీ బలవంతసింగు లుచ్చైస్స్వరమునఁ బలికిరి. అందఱు జయజయధ్వానము లొనరించిరి.

ఇంతలో ద్వారదేశమున గొప్ప కలకలము బయలు దేరెను. ఉకోజీసైనికులకు, రాణివెంట వచ్చిన సేనలకుఁ బోరాటము కానుండెను. రాణి తిరుగ నెంతటికిని రాకుండుట చే నపాయశంకాతురులైన సైనికులు మసీదులోఁ బ్రవేశింప నుండ, నుకోజీ సైనికులు నిరోధించి యెదిరించుట జరిగెను.

సర్వము క్షణములో గ్రహించిన బీగము, ద్వార ప్రదేశమునకు వచ్చి తన సైన్యములకుఁ బోరాటము పని లేదని యాజ్ఞనొసంగెను. ఇరు తెగలవారును బంధువర్గము వలె విడిపోయిరి.

# ఏడవ ప్రకరణము

## (లాలాబాయి)

ఆహా! ప్రపంచ మెంతమాయలో మునిఁగియున్నది. నీటిబుడగలవలె క్షణికములై, మెఱుపులవలె చంచలము లైన భౌతికసుఖములకై యెందఱెందఱో మానప్రాణధనముల నవాబు వినాశము చేయుచున్నాఁడు! కాటుక కొండలవలె నెట్టయెదుట పాపరాసులు పెరుగుచున్నను మోహాంధుఁడై గానక యెంతెంత ఘోరకార్యముల నాచరించుచున్నాఁడు! మావలె నెందఱో రాజకుమారకులు దేశబహిష్కృతులై దరిద్రతకు లోనై తినఁ దిండి, కట్ట గుడ్డ కఱవై యల్లాడుచుండ, ఈ నాస్తికుఁడు నిరంకుశుఁడై నిరంతరవిశ్శృంఖలపాప విహారము సలుపుచు సురాపానమత్తుఁడై యున్మత్తుఁడై వినోదించుచున్నాఁడు. ఈ యహమ్మదుషా మూలముననే గదా నా అనుఁగు సోదరుల కిట్టి బహిష్కారము! తండ్రిచే నల్లారు ముద్దుగఁ బెంచఁబడిన నాకా యీ కష్టములు! ఈ మూఢుఁ డింతతో విడువక నన్ను వివాహము చేసికొనఁ దలచి నట్లును, నందులకై యత్నించుచున్నట్లును వినుచున్నాను. నా సోదరులు సర్వస్వము గోల్పడి ఫకీరులచందంబున జీర్ణవసన ధారులై, మేధావులయ్యు, శౌర్యనిధులయ్యు, మానవంతు లయ్యుఁ గాలకర్మములకుఁ గట్టువడి, నుసిగప్పిన నిప్పుకల వలెను, మసిఁబడిన మాణిక్యములవలెను గాన్పించుచు

న్నారు. నేను వారి కడగండ్లఁజూడఁజాలకున్నాను సరిగదా! మాస్థితి నట్టేటినావవలె నున్నది. ఈ తుపానున దరిఁజేరు మార్గము గానరాదు. ఆపద్బాంధవుఁడగు దేవునివలె ఉకోజీ నాయన్నలకుఁ దోడ్పడుచున్నాఁడు. మహాత్ముఁడగు బలవంతసింగు ఛాయవలె నిలిచియున్నాఁడు. వారు మా పాలిటి దేవతలే! వారి పురుషప్రయత్నములకు భగవంతుఁడు సాయపడును గాక !

అని యేమేమో చింతాచిత్తముతో వివిధగతుల యోచించుచు రాత్రిసమయమున సహ్యాద్రినగరమందలి యొక ప్రాచీన శిథిలసౌధమునఁ బదునెనిమిదేండ్ల యువతి లాలాశాయి తలపోయుచుండెను.

ఈమెసౌందర్య మపురూపము. స్వర్గభ్రష్టయగు నప్సరఃకన్యవలె, భూమికి డిగ్గిన చంద్రరేఖ భాతి, నిలుకడఁ బొందిన మెఱుపుఁదీగియ కైవడి యాబాలిక ప్రకాశించుచుండెను. నిరస్తభూషణయయ్యు, నస్తప్రమోదయయ్యు, నిరాడంబర వసనధారిణియయ్యు, సహజసౌందర్య ముట్టిపడ వెలయుచుండెను. కాని, యామె ముఖపద్మము పరిపరివిధములగు భావనోష్ణవాయుతరంగ ప్రసారములచే వాడిపోయి యుండెను.

అట్టి సమయములో నాకస్మికముగ నుకోజీ యందు ప్రవేశించెను. ఆలోచనానిమగ్నయగు నామె యీతని గమనింపలేదు. కాని యాతఁడు 'సోదరీ' అని సంబోధింపఁగనే

'అన్నా' అని యానంద విస్ఫారిత నయనములతో నాహ్వా నించెను.

ఉకోజీ 'అమ్మా! నీవింక నిశ్చింతతో నుండుము. మనకు దైవము సానుకూలపడెను. మహారాజ్ఞీమణి రాజ్యముఁ దిరుగ నిప్పింతునని ప్రమాణపూర్వకమగు వాగ్దానమొన రించెను. ఆమె యసత్యమాడునది గాదు. నీ విక పరుండు మమ్మా' అని వెడలిపోవుచు మరల 'నీసోదరు లుదయము ననే వత్తురు. అవసరములగు కార్యములచే నింకను తిరిగి రాలేను' అని పలికి వెడలిపోయెను.

లాలాబాయి యీ శుభవర్తమానమును విని యానంద వివశయై దేవుని మనసార ధ్యానించి యేమేమో తలంచి కొనుచు నిద్రించెను. ఈవల నిరువురు పరిచారకులు, నిరువురు సేవకురాండ్రు నిద్రించుచుండిరి.

అర్ధరాత్రమయ్యెను. అంతయు నీరవమై నీరంధ్ర నిశ్చలతిమిరకరాళమై యుండెను. అప్పుడే దివాణమున నొక్క గంట కొట్టెను. అట్టి సమయమున నీ ప్రాచీనజీర్ణ భవన ప్రాంగణమువైపు నలువురు వ్యక్తులు మెల్లమెల్లగ నడుగిడుచు వచ్చి చేరిరి. వారిని గుర్తింపఁ జీకటియందు తెలి యరాని సమస్యయైనను నైఋతిని బట్టి దొంగలవలెఁ దోఁచు చుండిరి. వారట్లు వచ్చి క్రమక్రమముగాఁ బిల్లులవలె నడు గులిడుచు లాలాబాయి పరుండియున్న మంచమును సమీపించిరి.

అప్పటి కా ముగ్ధ నిర్విచారముగ నిద్రించుచుండెను. గదియందు చిన్న యాముదపు దీపము మాత్రము మినుకు మినుకు మనుచుండెను. చోరులామెను సమీపించి కరసంజ్ఞలచే నొండొరుల యభిప్రాయములఁ దెలిపికొనుచుండిరి. వారు నిశితనిరీక్షణములఁ బిల్లులవలెఁ బఱపి యామెయే 'లాలాబాయి' అని గుర్తించిరి.

వెంటనే వారిలో నొకడు కార్యకారియై యేదో యొకవస్తు వామె నాసికారంధ్రసన్నిధానమున నుంచెను. వెంటనే యామె చైతన్యవిహీనవలె నయ్యెను. వార లంత నెఱనుగైకొని మునిగాళ్లపై నడచిపోవు నిర్దయాభీలశార్దూలములవలె నా కటికిచీఁకటియం దెందో యదృశ్యులైరి. ఆ గాఢాంధకారమున సర్వసాక్షియగు భగవంతుఁడు దక్క-యన్యు లా కార్యమెఱుంగరు.



# ఎనిమిదవ ప్రకరణము

## (విముక్తి)

అప్పటికి సూర్యోదయమై నాలుగు గంటలైనది. అట్టి సమయమున అహమ్మదాబాదునకు ఈశాన్యముగా నిరువదిక్రోసుల దూరముననున్న యొక యరణ్యప్రదేశమున నిమ్నోన్నతములుగాని విశాల భూభాగమున నొక సైన్యము విడిసియుండెను. తదంతర్భాగమున రాజపుత్రోచితమగు పటకుటీరమొం డమర్పఁబడియుండెను. అందిరువురు యువతులేమేమియో సంభాషించుచుండిరి. అందు ప్రభ్వివలెఁ గానిపించునామె యిట్లనెను: "సరళా! నేఁడు మన పుణ్యము మంచిది. కావుననే ఉక్కోజీ బలవంతసింగులచే సులభముగా విడువఁబడితిమి. అంతేగాదు. సరళహృదయుఁడగు బలవంతసింగు సగౌరవముగ, మనరక్షణార్థము తనసేనలతో మనవెంటవచ్చుట యాతని రాజపుత్రాభిమానమును వ్యక్తము చేయుచున్నది."

సరళ॥ అమ్మా! యథార్థము. కానిచో మనపాట్లు కుక్కలకు నక్కలకుఁగూడ నుండవు. రాజపుత్రులు మహమ్మదీయులవలె కఠినులుగారు. కావుననే జహనారాబీగము యొక్కయు, సరళ యొక్కయు మానప్రాణములు గాపాడఁబడినవి.

జహ॥ చెలీ! ఆమహాపురుషులకుఁ గృతజ్ఞత నెట్లు చెల్లింపఁగలనో తెలియకున్నది. వాఘోజీ సోదరులయందు మాత్రము

నాకు అకారణముగా మంచిభావము పొడగట్టలేదు. కాని యొకమాటు బలవంతసింగు నన్నుఁజూచి నపుడు నిన్నుఁజూచినపుడు చకితుఁడై యేమియో చింతించువానివలె నున్నాఁడు.

సరళ॥ అమ్మా! అవును. వాథోజీసోదరుల ముఖములలో స్వార్థవిషము చిలుకరింపఁబడియున్నది. ఇఁక బల వంతసింగు. అతనియందేలకో నాకు భక్తి కుదిరిపోయి నది. ఆతఁడు దయార్ద్రహృదయునివలెఁ గాన్పించు చున్నాఁడు. అట్టియాతని నెప్పుడో చూచినట్లున్నది.

జహ॥ అతఁడు దయాశీలిమాత్రమేగాఁడు; ఔదార్యశౌర్య స్వభావములుగలిగిన యున్నతరాజవంశజాతుఁడుగా గాన్పించుచున్నాఁడు.

సరళ యేమియో తలఁచుకొని కాఁబోలు రెండు మూఁడు కన్నీటిబొట్టులను విడిచెను. అంత జహానారా 'ఏమే చెలీ! ఏలకో దుఃఖించుచున్నావు' అనెను. అందులకు సరళ 'ఏమియు లేదమ్మా! కంటిలో నేదియో నలుసుపడినది' అనెను. అంతలో విదుషక చతురయుఁ బ్రౌఢయు నగునామె సంభాషణము మార్చి 'తల్లీ! నావిషయములకేమిగాని ప్రస్తుతము నీవొనరించిన వాగ్దానము తగనిది.'

అనుచు నిశితపరీక్షాదృష్టితో బీగము ముఖమును బరికించెను. కాని యట్లుచూచుటలో 'ఈమె తప్పించు కొనుటకే యీవాగ్దానము చేసినదా? లేక సత్యముగా పలి

కిపదా' అను నర్థముదెలిసికొను కాంక్ష విస్పష్టమగు చుండెను. అంతలో విడువక సరళ మరల నిట్లు పలికెను.

'దేవీ ! రాజపుత్రవంశములు వాగ్దానములనొసరించి తప్పకుండుటలోను, నిష్కపటతలోను నిలిచి రాజ్యాంగ ప్రవీణులగు నితరజాతులవారిచేత వంచింపఁబడి నశించుచు న్నారు. వాగ్దానములకేమి ? వాగ్దానము చెల్లింపనిచో ప్రాణ త్యాగ మొనరించుకొనెదవా? చాలు ! చాలు ! ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కాయాటలుగదా !' అని పలికెను.

ఈవాక్యలకు రాణిమనస్సు చివుక్కుమనెను. క్రోధా వమానలజ్జాకంపితస్వరమున నిట్లనిపలికెను. 'ఏమే! యిట్లం టివి. నాచిన్ననాటినుండియు నన్నెత్తి పెంచినదానవయ్యు నాస్వభావమును దెలియకున్నావు. అస్థిరమగు బ్రతుకు కొఱకు సుస్థిరమగు కీర్తిని బోగొట్టికొనవలెనా? ఆతఁడు నీ వంటి కుటిలరాజనీతితంత్రజ్ఞుఁడైనచో నిప్పటికీ అహమ్మదుషా రాణివాసముయొక్క యగచాట్లెట్లుండెడివో. నావాగ్దానము మఱచునంతటి నీచత, మహమ్మదీయకులమునఁ బ్రవేశించి నంతమాత్రమున నన్నుఁజెంద లే'దని మందలించెను.

ఇంతలో సేనావరణమున నొక కలకలముపుట్టెను. ఏమో ! అని యటు నిటు చూచుచుండ నలుగురు పురుషు లను నొకపల్లకితో సేనానాయకుఁడు రాణిచెంతకుఁ గొని వచ్చెను. ఆ సేనానాయకునితో బలవంతసింగుకూడ వచ్చెను. అంత రాణి యిదియేమనెను. సేనానాయకుఁడు

'అమ్మా! వీరు చోరులవలె నున్నారు. అనుమానముచే పల్లకినిఁదో డ్తెచ్చితిమి' అనెను. రాణి యానలువురను గద్దించి ప్రశ్నించెను. వారు మాఱుపలుకలేదు. కాని మాటికిని నిర్బంధింపఁబడి యందొకఁడు 'తల్లీ! మేము నవాబుగారి సేవకులమే! వారి యాజ్ఞచే నొకయబలను దొంగిలించి తెచ్చుచున్నా'మని పలికెను.

ఈమాటలు విన్నతోడనే బలవంతసింగు కన్నులు రక్తతామ్రములయ్యెను. రాణియు లజ్జాభరమునఁ గ్రుంగిపోయెను. వెంటనే తలుపులు దెఱువ నాజ్ఞాపించి, వెంబడినే 'పశువా! ఇందలి నిర్భాగ్యురాలెవ్వరు?' అనియడిగెను. భటుఁడు 'లాలాబాయి' అనెను. రాణి కంపించిపోయెను. బలవంతసింగు ప్రళయరౌద్రమూర్తియయ్యు సమాళించికొని యింకేమి జరుగునో చూతమని మిన్నకుండెను.

రాణి తొట్రుపాటుతోఁ బల్లకికడకు నడచిపోయి, తానై తలుపులు తెఱచుచు బలవంతసింగునుఁజూచి 'తండ్రీ! యీ అవమానమును నన్నుఁదలఁచికొనియైన క్షమింపుము' అని వినమ్రయై పలికెను.

తలుపు తెఱచిన వెంటనే శంపాలతికనుబోలు లాలాబాయి మూర్ఛితావస్థలోఁ గనఁబడెను. రాణి యామెను తన యంకమునఁ జేర్చికొనెను. సరళ వలసినశైత్యోపచారములను చేసెను. లాలాబాయి కనులువిచ్చి చూచెను. ఆమె మనోహరమూర్తిని, నామెతరళకురంగనయనములు చూచి జహనారాబీగము మిక్కిలి యబ్బురపడసాగెను. ఆమె తన

యాశ్చర్యాందోళనములఁ బ్రయత్నముచే నడంచికొని 'చెల్లెలా! భయపడకుము. నీకు నేనభయమిచ్చితి' ననెను. లాలాబాయి మాఱుపలుకక తదేకదృష్టితో చూచిచూచి యామెను గాఢపరిష్వంగమున నదిమికొనెను. బలవంతసింగు హర్షగంభీరస్వరమున 'మహారాజ్ఞికి జయమగుఁగాక!' అని యఱచెను. సరళ యులికిపడిచూచి యాకంఠధ్వనిని తద్ధ్వనికారకగంభీరరూపునిఁ బరీక్షించి పరీక్షించి యేమేమియో తలపోసికొనెను. లాలాబాయి బలవంతసింగును జూచి నందితయయ్యెను.

అంత రాణి కొన్ని యమూల్యాభరణములను లాలాబాయి కొసంగి 'అమ్మా! నాభర్త యపచారములను మన్నింపుము. నేఁటినుండి నీవు నాచెల్లెలవు' అని పలికి బలవంతసింగు దిక్కు మొగంబై 'మా యవివేకమును క్షమింపుము. నీవిఁక నీసైన్యముతో ఈ లాలాబాయిని దీసికొని పోయి యామె యన్నల కొప్పగింపుము. నవాబును నన్నును క్షమింప వేఁడుము. ఇచ్చటినుండి నేను సురక్షితముగా నా పరివారముతో సేనతో రాజనగరమునకుఁ బోగలను' అని వచించెను. అంత బలవంతసింగు కృతజ్ఞతాబద్ధకంఠుఁడై 'మానవరూపధారిణిని దేవతామతల్లిని జూచుచున్నాను' అని పలికెను.

అపచార మొనరించిన భటచతుష్కమునకు రాణి దలవాచునట్లు చీవాట్లుపెట్టి 'యిఁకముందిట్టి నీచ కార్యముల

నొనరించినచోఁ గఠినముగా శిక్షింతును. మీవంటి నీచు లుండుటవలననే నవాబునకిట్టి నైతికదౌర్బల్య మబ్బినది 'అని పలికెను.

బలవంతసింగు లాలాభాయితోఁగూడఁ దగుపరివారముతోఁ జీలిపోయెను. రాణి తన యోధవర్గముతోఁగూడ నహమ్మదునగరాభిముఖయై పోయెను.



# తొమ్మిదవ ప్రకరణము

(ప్రతిజ్ఞానిర్వహణము)

జహనారాబేగము తనయంతఃపురమును చేరికొనెను. ఆమె మనస్సు కలఁతబొందిన కొలనివలె నుండెను. హృదయమునందలి భావములు జలజినీపత్రాంతరవారిబిందువులవలె చలించిపోవుచుండెను. ఎన్నఁడెఱుంగని యావేగవాయువశమున హృదయకమలము తూలియాడుచుండెను. మనఃప్రశాంతిగాని, సమ్మోదముగాని యామెకడఁ గాన్పింపదు. చారుతరఁగోమలతకు నునికిపట్టయిన యామెముఖము గంభీరమై కార్యాలోచన తత్పరమై యుండెను. హృదయము తటతట కొట్టికొనుచుండెను. కన్నులు నిశ్చలతీక్ష్ణదృక్కులఁబఱపుచుండెను. ఏదియో మహత్తర కార్యాలోచన తత్పరమై యంతఃపురమునఁ గూర్చుండియుండెను.

సరళ వయసుననామెకంటెఁ బదేండ్లు పెద్దది. సుమారు ముప్పదైదేండ్లుండును. సిద్ధీఫకీరు సమాధినుండి ప్రస్థానానంతర మామెమనస్సు మిగులఁ జలించిపోయెను. ఉన్మత్తప్రాయ యయ్యెను. అట్లయ్యు స్వాధీనహృదయ గావున దానినడంచుకొని యంతర్బడబాగ్నిగల యగాధాంబుధి ననుకరించి యెట్టి యలజడి లేనట్లు గాన్పించుచుండెను. సహజసిద్ధమగు చిఱునగవు, కళ యామెముఖము నలంకరించెను. అట్టిసహజవిధానమున వచ్చి 'నేనప్పుడు చెప్పలేదా' అనెను. రాణి

కఠోరస్వరముతో 'ఏమి చెప్పితివి' అని గద్దించెను. జంకు గొంకులనెఱుఁగని సరళ 'ఉక్కోజీకిచ్చిన వాగ్దానము చెల్లింప నవసరములేదు' అనిపలికి యామెముఖమును సాభిప్రాయము గఁజూచెను. ఈమాట రాణి కోమలహృదయపద్మమున నిశిత శూలమువలె నాఁటిపోయెను. దెబ్బతిన్న యాఁడుపులివలె గర్జించెను. సరళ దీనముఖముతో 'అయినచో నాత్మహత్య యే నిజమా' అనెను. 'అవును' అని రాణి గంభీరస్వరమున గర్జించెను. ఆ మాట విని సరళ పెదవి విఱిచి యపహాస సూచకముగ నవ్వి చేతులు త్రిప్పుచు 'గొప్ప రాణివే' అనెను. అంతులకు బీగము 'ఏమే' అనెను.

సరళ॥ కాదా! మఱి నీవు గొప్ప రాణివి.

రాణి॥ నేను చెప్పితినా?

సరళ॥ చెప్పవలెనా! చెప్పకుండగనే తెలియుచున్నది.

రాణి॥ ఎట్లు?

సరళ॥ భర్తను దుష్కృత్యములనుండి మరలింపలేక యాతని చేతి కీలుబొమ్మయై యాతనికొఱకైన యొక భోగ్యవస్తువుగానేర్పడి యెట్టి యధికారమును లేక పట్టమహిషిని అనుకొనుచున్న నీవు గొప్పరాణివి కావా మఱి?

ఈ మాటతో రాణిముఖము దుర్భరక్రోధావమాన ములచే నరుణమై క్రుంగిపోయెను. మెల్లగాఁదలయెత్తి 'సఖీ! క్షమింపుము. నేను పురుషకారమునఁ బొల్లపోవుదానను గాను. నైతికబలమే నన్నుఁగాపాడుఁగాక' అని పలికెను. సరళ

యానందమునకు హద్దు గాన్పింపదయ్యెను. తటాలున వచ్చి రాణిని గాఁగిలించికొనెను.

ఇంతలో నవాబు రాణియంతిపురికి విచ్చేసెను. అతఁడేదియో ధ్యానవిమగ్నుఁడై యప్పటివిషయములను గమనింపలేదు. రాణి యెదురేగి కొనివచ్చి తాఁగూర్చుండిన యున్నతాసన మొసంగెను. సరళ వెడలిపోయెను. అహమ్మదుషా కించిత్కఠోరస్వరముతో 'ఈ మర్యాద యెందులకు? నీవే నేఁటినుండియు సుల్తానువుగదా' అనెను. రాణి యాతని స్థితిని బరికించెను. తన కార్యానుకూల వాతావరణము గాన్పింపలేదని లోలోన వగచెను. అయినను ధీరోదాత్త గావునఁ దనప్రణాళికానుకూలముగ సంభాషించెను. 'అవును, నేనే మీ స్థానము నాక్రమించియుండినచో దేశము సుభిక్షముగ బ్రతికియుండును. విషయవాంఛలకులోనై పాపకృత్యముల కొడిఁగట్టుటయేగాక నన్ను గద్దించు మీరు మీ శ్రేయోఽభిలాషిణినగు ధర్మపత్నిగాఁ దెలిసికొనలేరైతిరి.' నవాబీమాట విని యుగ్రుఁడై 'నీ వేయధికారమున లాలాబాయిని విముక్తనొనర్చితివి?' అనెను.

రాణి యింకఁ నోర్వఁజాలకపోయెను. ఆమె యాసనమునుండి వెంటనేలేచెను. అట్లుద్ధృతయైలేచి 'ప్రభూ! నేను బానిసను. నా తండ్రి నీకులోఁబడి మరణించి నన్ను హైందవ ధర్మచ్యుతగాఁ జేసెను. అతఁడు నీ మూలమున మరణించి నను భర్తృక్షేమమును సదా కోరుదానను గావుననే, యేయే యెడల మీ ప్రతిష్ఠాభంగమగుచున్నదో యాయాస్థలము

లందు నేను దానిని పునఃప్రతిష్ఠించుచున్నదానను. దోషము లన్నిఁటిలోఁ బరమదోషములైన మదిరామదిరాక్షీసేవనముల విడువనిమీరు యుక్తాయుక్తములెఱుఁగక నన్నిట్లాడిన దోషములేదు. నేను లాలాబాయిని విడిపించితినని యెవ్వరు చెప్పిరో వారు—ఆ బుద్ధిమంతులు, నేఁడు రాణిగా నిలుచున్న యీ తరుణి సహజౌదార్య విలసితుఁడు నైతిక బలసంపన్నుఁడునైన ఒక రాజపుత్రుని కరుణాలేశము లేకయుండినచో నిప్పటికిఁ జెఱఁబడి, హింసింపఁబడి మరణించి యుండునని చెప్పియుండినచో సంతోషించియుందును. మా రాజపుత్రులు మీవంటి వారైనచో నిప్పటికే యీలోకమును వీడి యుండుదానను.'

ఈ మాటలతో నవాబు స్తంభించిపోయెను. ఏమి! ఏమి? అని ప్రశ్నపరంపరలు గుటిపింపసాగెను.

రాణి మరలఁ జెప్పసాగెను.

'ప్రభూ! ఇంట సుఖముగా నిద్రించు లాలాబాయిని చోరులైన నీ బంటులుబంధించిరి. సర్వస్వము నపహరించి దేశభ్రష్టుల నొనరించిన గర్భశత్రువవగు నీయొక్క యర్థాంగిని నన్నుఁ జేఁజిక్కినదానిని నుదారపూర్వకముగ రాజపుత్రవీరోచితముగ విడిచిరి. ఇట్టి పట్టున నెవ్వరిని గొనియాడవలెను?'

నవాబు క్రోధాగ్ని యవమానవర్షధారలచే నాఱిపోయెను. శిరము వంచుకొనియెను. ఏమియో చెప్పుటకుఁ బెదవిఁ గదలించెనుగాని రాణి నిలువక మరల నిట్లుపలికెను.

'వాఘోజీ జితోజీల కరుణయు, ఉకోజీ బలవంతసింగుల యుదారధర్మ ప్రవర్తనము నన్నుఁ గాచినవి. వారు నన్ను తాఁకక, చెఱవిడక, యవమానింపక యహమ్మదు నగర పాదుషా యంతఃపుర మర్యాదను గాపాడిరి. అట్టి మహాపురుషులతోడి వైరముకంటె స్నేహభావము సుస్థిరశ్రేయోదాయకమేగాక, పాపసంహారకము.'

నవాబు కన్నెత్తిచూచి 'అయిన నేమి చేయవలెను?' అని ప్రశ్నించెను.

రాణి : వెంటనే వారి రాజ్యము వారికిచ్చి వేయవలెను.

నవాబు తొట్రుపడియెను. 'ఆలోచించియే మాట్లాడుచున్నావా?' అనెను.

రాణి రాజఠీవి మెఱయ 'వందసారులు, వెయ్యిసారులు, కాదు లక్షసారులు ఆలోచించియే మాటలాడితిని. ఖురానుసాక్షిగా వారికి వాగ్దానమిచ్చితిని. అంతేకాదు. నా వాగ్దాన భంగమైనయెడలఁ బ్రాయశ్చిత్త మాత్మహత్యగాఁ బ్రతిజ్ఞ చేసికొంటిని' అనెను.

నవాబు తొట్రుపడెను. ఏమియుఁ బలుకఁ జాలడయ్యెను. రాజపుత్రాంగనలు మహమ్మదీయాంతఃపురముల కీడ్వఁబడినను ప్రతిజ్ఞా శౌర్యముల విడువనివారనియుఁ, బ్రాణములను దృణప్రాయముగా గణించువారనియు నాతఁడనుభవముచే నెఱుఁగును.

ఇఁక నన్యథాపలుకుట లాభదాయకముగాదని చతురుఁడగు ఆ దక్షిణ నాయకుఁ డూరకుండెను.



# పదియవ ప్రకరణము

## (నవాబు రాయబారము)

ఆలోచనామందిరమున వాఘోజీసోదరులు ఉకోజీ బలవంతసింగు మొదలగువారు సమావేశమై యత్యంత ప్రముఖవిషయములనుగూర్చి ముచ్చటించుచుండిరి. అప్పుడు బలవంతసింగిట్లు చెప్పఁదొడంగెను.

'సోదరులారా! రాణియొక్క నిరుపమానౌదార్యము లాలాబాయి రక్షణమునకుఁ దోడ్పడి వాఘేలీ రాజవంశజుల మర్యాదను గాపాడినది. ఆమె మహమ్మదీయాంతఃపురమునఁ బడినను మానవతీ మానసంరక్షణము మఱువలేదు. మఱియు నామె యన్నృతమాడునదిగాఁ దోఁచలేదు.'

ఉ॥ నాకు నట్లేతోఁచుచున్నది. కాని దుష్టుఁడగు నవాబు సమ్మతింపనినాఁడు కర్తవ్యమేమి? రాజ్యదానమునకు నవాబియ్యకొననినాఁడాసాధ్వి మరణింపవలసినదేనా? ఆమె దుర్మరణము దేశౌన్నత్యమునకు సాధుజన సౌఖ్యమునకు భంగకారియగును. కావునఁదత్పాపములు మనల నాక్రమించును. కావున నొకవేళ కార్యసఫలత కానప్పుడు బీగముయొక్క యాత్మహత్య సిద్ధింపని రీతిని చూడవలెను. అట్టియత్నములఁ బొనరింపవలెను. కాలక్రమమున బలవంతులమై ఖడ్గహలాగ్రముఖమున రాజ్యక్షేత్రఫలమును బొందు

దుముగాక! అట్టిస్థితియే సంభవించినచో నామూఁడు వందల గ్రామములయందలి సైనికబలము, ధనము వెచ్చించి కంఠమునఁ బ్రాణముండుదనుక పోరాడెదను. అంతియగాని రాణియొక్క చావునకు నేను సమ్మతింపను.

ఈమాటలకు సభయందు హర్ష ధ్వనులు చెలరేఁగెను. అందఱు నుకోజీయొక్క యుదారశౌర్యగుణములఁ గొనియాడిరి.

ఇంతలో నొక యాశ్వికుఁడు హుటాహుటి నచ్చటికి వచ్చెను. అతఁడు ప్రవేశపెట్టఁబడెను. అందఱి దృష్టులాతనిపై మరలెను. అందఱు నతఁడహమ్మదునగరమునుండి వచ్చిన రాయబారిగ గుర్తించి సందేశమేమియో యని వినఁగుతూహలపడుచుండిరి.

రాయబారి యుచితరీతిని సత్కరింపఁబడి యుచితాసనమునఁ గూర్చుండెను. అనంతర మాతఁడు తాను తెచ్చిన రాయబారలేఖను వాఘోజీసోదరుల కిచ్చెను. వారు సగౌరవముగ దానినిఁ గైకొనిరి. సభ్యులందఱకుఁ దెలియునటుల ఉకోజీ యిట్లు పఠించెను:

'గుజరాత్ పరిపాలకుఁడు, అహమ్మదునగర ప్రభువు, అహమ్మదుషా వాఘోజీసోదరులకు హృదయపూర్వకముగ నభినందించి వ్రాయులేఖ :—

మీరు 'ముకుర్బా' గ్రామమునఁ జేసిన సాహసకార్యమునకు, రాణియెడల మీరుచూపిన గౌరవభావమునకు

మిక్కిలియానందించినాను. ఇదివఱకు నామూలమున మీరు మిక్కిలి కష్టములనుబడి మీగ్రామములన్నిఁటిని గోల్పడితిరి. అందులకు మిగుల విచారించుచున్నాను. గతించిన విషయము లెట్లున్నను మనము నేఁటినుండి సద్భావముతో నేకీభవించి మెలఁగి దేశసౌభాగ్యమునకుఁ బరస్పర సౌఖ్యమునకుఁ దోడ్పడవలెను. కాన నేను మీకడనుండి గైకొనిన సర్వ గ్రామములను మీహస్తగతముచేయుచువంశపారంపర్యముగ వానిననుభవించు నఖిలాధికారములు నొసఁగుచున్నాఁడను. ఇయ్యది రాణియెడ మీరుచూపిన యౌదార్యమునకై దత్తమొనరింపఁబడిన ప్రతిఫలరూపమగు శాశ్వతపారితోషికము. మీరు నేఁటినుండి యథాక్రమముగా మీ ప్రభుత్వమును నా పాలనముక్రింద స్థాపించికొనవచ్చునని యుత్తరువు లిచ్చుచున్నాను.'

సభయందు హర్షోద్రేకమున జయజయధ్వనులు చెలరేఁగెను. సోదరులు మిగుల సంతోషవార్ధి నోలలాడిరి.

ఉక్కోజీ మరల చదువనారంభించెను:

'సోదరులార! మనవైయ్యమునకుఁ జిహ్నముగా, శాశ్వతమగు వియ్యమందవలెనని నాయభిప్రాయము. వియ్యముమూలమున మనభావిసంతతిగూడ కయ్యమునకుఁజోరదు. సౌందర్యరాశియగు మీసోదరి లాలాబాయిని పాణిగ్రహణమున నాకొసంగి నేఁబొనరించు మర్యాదలను స్వీకరించి నన్నానందింపఁ జేయవలెనని కోరుచున్నాను.

హిందూమహమ్మదీయ సంబంధములు మన కీనాటివి గావు. అంతియగాక నాపితామహుఁడగు జాఫర్ఖాఁ ప్రభువు తొలుదొల్త హైందవుఁడేగదా! కావున నేనును రాజపుత్ర వంశస్థుఁడనని చెప్పికొనఁగలను. ఇదిగాక నాపట్టమహిషి యగు జహనారాబీగము హైందవవనితయేగదా! కాన నిది క్రొంగ్రొత్త సంస్కరణముగాదు. అంతియగాక హిందూమహమ్మదీయ సంబంధమును బెంపొందించి, యైకమత్యమునుగూర్చి ప్రజాక్షేమమునకు, రాజ్యాభివృద్ధికి, భరతదేశ సౌభాగ్యమునకుఁ దోడ్పడెదముగాక! నేఁటినుండి నెయ్యుర మేగాక వియ్యాలవారముగూడ నయ్యెదముగాక! కావున నా యాస్థానమునకు మీరు ఉకోజీ బలవంతసింగు మహాశయులతోఁగూడ వచ్చి నాయిచ్చు నాతిథ్యగౌరవములను గ్రహించి యానందించి యానందింపఁజేసెదరుగాక. విలంబనము లేక యిట్లు చేయుదురని ముమ్మాటికి విశ్వసించుచున్నాఁడను.

అహమ్మదుషా'.

లేఖ నుకోజీ ముగించెను. నిశ్శబ్దనీరధియన నుండిన సభాస్థలము పరస్పర సంభాషణా వాయుప్రసారణపరంపరలచే క్షుభితమై నినాదకలితమయ్యెను. పలువురు పలువిధములఁ బలుకసాగిరి. బలవంతసింగుముఖము జేవురించెను. వాఘోజీ సోదరుల ముఖము లుదయకాల చంద్రబింబముల చందమునఁ గళావిహీనములయ్యెను. వారు చిత్రప్రతిమలవలె నుండిరి. ఉకోజీ లేఖనుచదివి యనంతరము దీర్ఘనిశ్వాసము విడిచి స్తంభించిపోయెను. ఇట్లు మూఁడునాలుగు నిమిషములు

మాత్రము కడచెను. అంత వాథోజీలేచి 'సభ్యులార! ఇది, క్షత్రియ కులమున కగ్నిపరీక్షా సమయము. కులసంపన్నులకు విడఁదీయరాని విషమప్రశ్నము. మీ యభిప్రాయముల వినఁ గోరెదను' అనెను.

బలవంతసింగు వాథోజీ మాటలయందలి సారమును గ్రహించెను. అవి యంతస్సారములేనివని భావించెను. అట్లు తోఁచి యిట్లు వచించెను:

'వీరోత్తమా! నీ సోదరివిషయమున నీ కులగౌరవ విషయమున నీకుఁగల స్వతంత్రతా నిర్ధయాధికారము మఱచియో, లేక మాకొక గౌరవము సేయఁదలఁచియో సభ్యుల యుద్దేశ్యముల నడిగితివి. ముందుగా సుప్రసిద్ధవీర పుంగవుఁడుకోజీ యభిప్రాయమును వినవలతుము.'

ఈ మాటలు విని యుకోజీ యిట్లనెను:

'సభ్యులార! సమయమునుబట్టి కాలమునుబట్టి దేశస్థితినిబట్టి సాంఘికధర్మములు మాఱుచుండును. ప్రస్తుతస్థితిలో మన మహమ్మదుషా నెదిరింపఁగల శక్తిగలవారము కాము. వాథోజీసోదరులు పడుచున్న కడగండ్లను దలఁచినచోఁ గఠిన శిలయు ద్రవింపకతీఱదు. అదిగాక జహనారా బీగము గూడ యొకానొక కాలమున సుప్రసిద్ధ రాజబాలికయేగదా! మనుజుని ప్రవర్తనమునుబట్టియే మాన్యతయుండునుగాని మతమునుబట్టికాదు. మహమ్మదీయాంగనయైన బీగమునకు వన్నెయు వాసియుఁ దగ్గినదా! అదిగాక, హిందూ మహమ్మదీయ సమ్మేళనమునకుఁ బరస్పర వివాహసూత్రమే తగినబాటగాని

యున్మత్త వీరవిహారము కానేరదు. అది దేశద్రోహము, రక్తపాతైకమూలము, సంకుచితభావ సంయుతము నైన జాత్యహంకారమునే సూచించును. ఈ వివాహమూలమున హిందూమహమ్మదీయ సౌహార్దతయేగాదు; సోదరులకు రాజ్యప్రాప్తి, జహనారాబీగమునకుఁ బ్రాణరక్షణము జరుగును. వేఱువిధమున మనమాచరించినయెడల రక్తపాతము, దేశక్షోభము, బీగముయొక్క యాత్మహత్య జరుగును. కావున రాయబారానుసారము ప్రవర్తించుటయే తగునని నా యభిప్రాయము.'

ఇట్లు వచించి యుశోజీ యాసీనుఁడయ్యెను. సభ్యులీ యుక్తివాదమును వినిరి. పెక్కురేకీభవించిరి. సోదరులు సమ్మతించిన జాడ గానవచ్చెను.

కాని యందొకవ్యక్తి యారక్తనేత్రుఁడు, సందష్టాధరుఁడు, చటులభ్రూకుటి భీకరుఁడు, కంపమానస్వేదగాత్రుఁడు, లయసమయ యమసముండునై సభనెల్లఁ జప్పరించు చందంబునఁ జూచెను. అతఁడెవఁడు? బలవంతసింగు.



# పదునొకండవ ప్రకరణము

## (సింహ గర్జనము)

బలవంతసిం గిట్లనెను:

'వాఘేలీరాజవంశకీర్తిసౌధ మింతత్వరలో నుఱ్ఱూఁత లూఁగి యుర్విపై విఱుగఁబడునని తలఁచలేదు. ప్రసిద్ధరాజ సింహము లింతలో గ్రామమార్జాలము లగునని యెంచలేదు. ఉన్నతవంశ గౌరవచంద్రుఁడు తటాలున క్షీణించిపోవునని భావింపలేదు. మీరింత యధఃపతనోన్ముఖులై యున్నారని యొక్కనాఁడును భావింపఁజాలనైతిని. పితృపైతామహ సంపాదితయశోధనము నిర్భాగ్యులరై పాడుచేయుదురని స్వప్నముననైనఁ దలంపలేదు. నీచములై నింద్యములై మెఱుపుఁదీవియలవలె చంచలములైన దురితంపు సిరులనునమ్మి విషయభోగములనాసించి, దేశగౌరవము త్యాగముచేయు నిర్భాగ్యులు నిశ్శక్తులు నీయీ పేఢోలగమున నుండుటఁ గనులారఁ గాంచి, వారి మాటలను చెవులార వినుటకు లజ్జించుచున్నాఁడను. పరమవంశ గౌరవములఁ బాదుషాల పట్టుపాన్పులపై అమ్మికొను నిర్భాగ్యనీరస జీవనమునా ఉగ్రోజీ ప్రేరేపించునది! ఈతఁడు ఉగ్రోజీ కాఁడు. ఉగ్రోజీ యిట్లు మాట్లాడఁడు. చండమార్తాండుఁడు శీతకిరణుఁడు గాజాలఁడు. ఆఁకొన్న బెబ్బులి యల్పంపుఁబిల్లి కానేరదు. బహుశః సభాభిప్రాయ మెఱుఁగ నీతఁడిట్లు వచించియుండును. అట్లయగుచో సమర

ముఖమునఁ బ్రాణవాయువులైన నర్పింప సంసిద్ధుఁడనుగాని నేనిట్టి యకార్యకరణమునకు వాఘోజీసోదరులను బ్రేరేపింపను. బ్రేరేపింపఁజాలను. వాఘోజీసోదరులార! మీసాటిలేని వాఘేలీ వంశగౌరవమును దలఁచికొనుఁడు. మీవంశ ప్రసిద్ధుడగు కర్ణప్రతాపమును స్మరించికొనుఁడు. గుజరాతుయశస్సంపదను నట్టేటఁగలుపకుఁడు. శౌర్యమూలము, బలసంపన్నము, కీర్తిఫలాన్వితము నైన వంశ పారిజాతమును నామూలాగ్రముగఁ బెల్లగింపకుఁడు! బహిష్కృతులరై భాగ్యహీనులరై బాధావిలురై కృశించికృశించి యీ యరణ్యప్రాంతమున నెందేనిఁ గాకివలెఁ గుక్కవలె మరణించుటమేలు. మానవతీ మానభంగమే యథార్థార్థముగాఁ దోఁచునుగాని హిందూ మహమ్మదీయ సమ్మేళనముగా ఈ యవాచ్య రాయబారమును దలఁపకుఁడు. కులమునకై, దేశమునకై, స్వాతంత్ర్యమునకై దిగ్దిగంతర దీప్తిమంతమగు కాంతిపుంజములను బఱపి, కాలగగనసీమ నేఁటికిని బ్రకాశించుచున్న మన పూర్వరాజభాస్కరుల నున్నత స్మృతిపథమునకుఁ దెచ్చికొనుఁడు.'

సభ మరల గగ్గోలమయ్యెను. ఉకోజీలేచి కలకలమును వారించి వాఘోజీ సోదరుల నుద్దేశించి యిట్లు పలికెను:

'బలవంతసింగు వాక్యములు విన్నారుగదా! నేను చెప్పినమాటలును వింటిరిగదా! ఈ విషయమున మీస్వతంత్రాభిప్రాయమును సభాముఖమున వినగోరుచున్నాము. నేను నందఱుపోవు మార్గముననే పోయెదను.'

అంత సోదరులిట్లు పలికిరి.

'ఇచ్చట బలవంతసింగు వలెనిట్టి శౌర్యహీనుం డగు రాజపుత్రుండెవ్వండును లేఁడు. కాని శౌర్యముపేర నగ్నిలోఁ జొరఁబడు శలభమువలె రాజపుత్రులు మరణించుట రాజనీతిగాదు.'

ఈ వాక్యము లాలించిన తోడనే దండతాడిత భుజంగమువలె, ఆకృష్టకేసరియగు సింగపుఁ గొదమవలె, బలవంత సింగులేచి 'అవాచ్యములు, అనర్హములు, అల్పములు నైన మాట లీనృపకీటకములనుండి వింటిని. నేను మహేశ్వర సాక్షిగా నేఁటినుండి యీ క్షణము మొదలు నా సైన్యముతో నా పరివారముతో విడిపోవుచున్నాను. దేశద్రోహులకుఁ బతితవంశజులకు సహాయము చేయఁజాలను.' అని తటాలున సభనుండి లేచిపోయెను. ఆతనితో నతని యనుచరులును లేచిపోయిరి.

సభ యీ యకాల ప్రళయమునకు, నిర్మేఘవజ్ర నిపాతమునకు నిర్ఘాంతపడిపోయెను. కొలది నిమిషములలో వాఘోజీ సోదరులు తమసమ్మతిని రాయబారికిఁ దెలిపిరని వేఱుగ వ్రాయఁ బనిలేదు.

# పండ్రెండవ ప్రకరణము

## (బలవంత సింగు)

బలవంతసింగు శతగ్రామాధికారి. కేవలము స్వతంత్ర భావములుగల రసపుత్రవీరుఁడు. పరాక్రమమున ఉక్కుతునుక. రోషమున నిప్పుకణిక. అవమానము నావంతయైన నోర్వఁజాలఁడు. ఈతనిఁగూర్చి వీరగాథలు పెక్కులు గలవు. ఇంతటి వాఁడయ్యు వాఘోజీసోదరుల యెడగల ననురాగము చేతను, నుకోజీయందుగల గౌరవభావముచేతను, తోడి రాజపుత్రులయందుగల సానుభూతిచేతను నైచ్ఛికముగ వారినిచేరెను. అదిగాక యతనిపూర్వులు శౌర్యరసప్రధానమైన వాఘేలీ వంశభూపతులకడ సేనానాయకులుగ నాకానాకకాలమున నుండియుండుటచే నాఁటి ప్రణయమును స్మరించికొని నేఁటి వారివంశస్థులగు వాఘోజీసోదరుల దుస్థితికి వగచి విడువఁజాలని వాఁడయ్యెను. ఈతని సోదరుఁడు సుప్రసిద్ధపరాక్రమవంతుఁడగు శమంతకఠాకూరు. కాని వీరిరువు రేకోదరులుగారు. ఇతనిచరిత్ర మజ్ఞాతమని కొందఱందురు. ఇతఁడు బియోలప్రాంతమువాఁడు. సంస్థానసింగు బియోలా సంస్థానము రాజధానిగాఁ జేసికొని మూఁడువందల యేఁబది గ్రామములకధికారియై దేవేంద్రవైభవముతో నుండువాఁడు.

అట్టివాని సోదరుఁడగు బలవంతసింగు గుహాప్రదేశము నుండి వెడలివచ్చు క్రుద్ధసింహమువలె, వల్మీకమునుండి రోష

విస్ఫారితఫణమైవచ్చు కాలాహివలె, సభాస్థలినుండి రోష తామ్రాక్షుఁడై వెడలిపోవుచుండెను. అతఁడట్లు అహమ్మదు నగరమునకుఁ బశ్చిమదిశయందుగల తన యావాస గ్రామమునకుఁ దనపరివారముతోఁ జనుచుండెను.

ఆనాఁటిదినములలో సరియగు దారులు లేవు. అరణ్యమార్గముల బాటసారులు పోవుచుందురు. బలవంతసింగట్లు దుర్గమారణ్యమునఁ జనుచుండ మిట్టమధ్యాహ్నమయ్యెను. గుఱ్ఱములు బడలియుండెను. తనకును తన పరివారమునకు విశ్రాంతి వలసియుండెను. ప్రయాణమునుగుదింపఁదగినయొండు సరోవరతీరమున విడిసెను. లేఁబచ్చిక మేయుటకై యశ్వములవిడిచి విశాలవటవృక్షచ్ఛాయల సేదదీర్చికొనుచుండిరి.

రమారమి నాలుగుగంటల సమయమయ్యెను. భానుఁడస్తంగతుఁడగు సమయ మరుదెంచుచుండెను. ఇంతలో నలువురాశ్వికు లామార్గముననే వచ్చుచుండిరి. వారినిఁ జూచుటతోడనే, వారు గృహోన్ముఖుఁడగుచున్న అహమ్మదుషా రాయబారియు నతనియనుచరులు నని సులభముగా గ్రహించెను. అతనిఁ జూచుటతోడనే కోపము ద్విగుణీకృతమయ్యెను. కాని యయ్యది ప్రయత్నముపై నణఁచుకొనుచు 'రాయబారియందు తప్పేమిగలదు? మదాంధుఁడైన అహమ్మదుషాయందును, పందలైన వాఘోజీసోదరులయందును దోషముగలదు' అని తలఁచి మిన్నకుండెను.

అంత రాయబారి వీరిని గుర్తించి మిక్కిలి భయపడెను. బలవంతసింగు దీనిని గ్రహించి 'భయపడవలదు. నీవు నీదాత్యమునుమాత్రము నిర్వర్తించితివి. దౌష్ట్యము నీయది కాదు. అంతియగాని యధికప్రసంగివై మెలఁగలేదు' అనెను. రాయబారి బ్రతుకుజీవుఁడాయని తనయనుచరులతో నించుక యూపిరిని బీల్చికొని 'మహాశయా! నీయౌదార్యమునకు శౌర్యమునకు నభివందనములు. మీ దేశభక్తికి నమోవాకములు' అని పలికెను.

అంత బలవంతసింగు చిఱునగవుతో 'మిత్రమా! నేను వెడలినతరువాత సభయందలి విశేషములేమైనఁగలవా?' అని ప్రశ్నించెను. రాయబారి యిట్లనెను: 'గొప్పవిశేషము గలదు. మీరు సభను విడిచినవెనుక 'ఉకోజీ' వాఘోజీ సోదరులను వీడిపోయెను.' అనెను. ఈమాట బలవంతసింగు నాశ్చర్యసంభ్రమునిఁ గావించెను. 'ఎట్లెటూ! ఇది నిజమా' అని యాతురతతోఁ బ్రశ్నించెను. అందులకు రాయబారి యిట్లనెను: 'దిక్కులేనివారుగా నుండునాఁడు సోదరులసహాయమునకు నిలిచితిని. లాలాభాయి వివాహనిశ్చయముతో రాజ్యసంపాదనవిధానమేర్పడినది. ఇఁక నాసాయ మనవసరము. కావున నేను నాసంస్థానమునకుఁ బోవుచున్నాను. సోదరులకు మేలుకలుగుఁగాత అనిపలుకుచు నుకోజీ వెడలిపోయినాఁడు.'

ఈమాటలతో బలవంతసింగునకు 'ఉకోజీ' యందుగల కలుషభావము సడలిపోయెను. తనమనస్సులోనే యా

తనిని మెచ్చికొనెను. సోదరుల నీచస్థితికి, లాలాబాయి దుస్థితికి మిగుల దుఃఖించెను.

ఆతఁ డిట్టి యాలోచనా పరంపరలయందు మునిఁగి యుండఁగా రాయబారి యిట్లు హెచ్చరించెను: 'వీరపురుషా! ఒక్క యాంతరంగికమగు రహస్యవిషయము మీకు విన్నవించుచున్నాను; క్షమింపఁగలరా! అప్పుడే చెప్పవలసినది గాని యాసమయమందలి మీరౌద్రాకారమునుజూచి విన్నవించికొనలేదు' అనెను. 'అదియేమి? భయపడవలదు. నిర్భయముగా దెలుపవచ్చును' అని వాగ్దానమిచ్చెను.

'మహాశయా! మహారాజ్ఞీమణిగారి చెలికత్తెయగు సరళాదేవి మిమ్ము ప్రేమించినది' అనెను. ఈ మాటతో నతఁడు దిగ్భ్రమనుచెంది 'సేవకురాలా నన్ను ప్రేమించునది' అని యవమానితునివలెఁ బలికెను.

రాయబారి॥ ప్రభూ! సేవకురాలుగా నున్నను కులీనయగు క్షత్రియాంగన. ఆమెమతము కల్మషముగాలేదు.

బల॥ ఓయి! నన్నేల యిట్టి ప్రసంగములతో నవమానించెదవు? నేఁటికిఁ బదునైదేండ్లకుఁ బూర్వమునాఁటి నా ప్రణయము స్వప్నప్రాయమైపోయినది. వంశగౌరవ విచ్ఛేదనము నేఁడు నామతముగాదు.

అంత రాయబారి మాఱుపలుకక యొకలేఖను సవినయముగ నొసఁగి నమస్కరించి 'దీనిని చదివికొని యనంతరము విమర్శింపఁ బ్రార్థన' అని పలికెను.

బలవంతసింగు నిర్లక్ష్యముగ నిరాదరణపూర్వకముగ దానినిఁదీసికొని యలవోకగాఁ బఠింపసాగెను; కాని యాతఁడు క్రమక్రమముగా వృద్ధినిఁజెందిన యుత్సాహముతో దానినిఁ జదివి, మరలఁ బఠించి, యానందోద్రేకముతో బాలునివలె నొకగంతువేసి 'జయపరమేశ్వరా' అనిపలికి తన కంఠమునఁ గల యమూల్య మౌక్తిక హారమునుదీసి సగౌరవముగ రాయబారి కంఠమును దానిచే నలంకరించి పరిష్వంగ మొనరించి కొని 'మిత్రమా! నీవు నాయంధకార జీవితమునకు వెలుఁగుఁగల్పించిన జగద్బాంధవుఁడవు. నేఁటి నీ సాయము జన్మజన్మాంతరముల మఱువరానిది. నేఁటినుండి మనము యావజ్జీవ మిత్రులము. కావున శాశ్వతస్మృతి చిహ్నముగ దీనిని నీవు గైకొనుమని ప్రార్థించుచున్నాను' అని పలికెను.

రాయబారి కృతజ్ఞతనుచూపి యుచితరీతిని మాట్లాడెను. ఆ రేయెల్ల నచ్చట విస్రంభాలాపములతో వినోదములతో గడపి, మరునాఁటి వేఁకువను తమతమ గమ్యస్థానములకై ప్రయాణము చేసిరి.



# పదుమూఁడవ ప్రకరణము

## (జహనారా లేఖ)

లాలాబాయి తనపేర లిఖింపఁబడిన జాబును గంపిత కరములతో నిటులఁ జదివికొనసాగెను.

'సోదరీ, నీకు శతధా మేలగుఁగాత! పరాత్పరుఁడు రక్షించును గాత!

నన్నసృతవాదినిగ, రాజపుత్ర కన్యలను అహమ్మదుషాకుఁ గూర్చుపాపమున కొడిగట్టుదానిగ నూహింపకుము. ఏ ప్రాగ్జన్మపాపవిశేషముననో నేను వంశకళంకినినై యున్నత్తనరకకూపమునఁ బడితిని. అట్టిచో నింకను నుత్తమక్షత్రియాంగనల కన్నీటి కాల్వలలోఁ గొట్టుకొనిపోవు భావము నా హృదయకోశమున నెచ్చటను లేదు. కావున నన్ను నిందింపకుము.

నవాబుస్వభావము నీవెఱుఁగనిదిగాదు. నేను నిన్ను సోదరిగాఁదలఁచి కాపాడఁగోరి, నాఁడు బంధవిముక్తను గావించితిని. అయ్యది నామనోగత నిష్కళంకాభిప్రాయము మునే వ్యక్తీకరించుచున్నది. నేను నపరాధినికాను. నేను కులదూషితనయ్యు సర్వక్షత్రియ దూష్య కార్యములకుఁ గడంగఁ జాలను. కావున 'అహమ్మదుషా' తోడివివాహము నా సంకల్పముగాదు. ఇందు నా కెంతమాత్రము ప్రసక్తిలేదు.

నీ సోదరులకు రాజ్యమిప్పించెదనని ప్రతినఁగావించితిని. అంతియగాని తదర్థము నిన్ను ముసల్మానుల యంతిపురిచెఱను జేర్చు కొంచెపుఁబనికిఁ గించిన్మాత్రముగూడ సంకల్పించిన దాననుగాను. ఇది దైవసాక్షిగఁ దెలుపు వాక్యమని యెఱుంగుము.

నా భర్తయే యగునుగాక. మోహాంధుఁడగు నా నాథుఁడు చేసినయకార్యము క్షంతవ్యముగాదు. ఈ విషయమున నేను కేవల మబలామాత్రమనై నీకు సాయము చేయలేకపోయితిని.

అమ్మా! నీవు హృదయపూర్వకముగ నవాబును వరించినచో నా యభ్యంతరములేదు. నేను నిన్నేక జననీ స్తన్యముఁగ్రోలిన చెల్లెలినివలె గౌరవింతును. దీవింతును. నాకుఁగల సర్వాధికారములు నీకర్పింతును. అట్లిచ్ఛగింపనినాఁడు నిన్ను నేను నిర్బంధింపను. రాజ్యము నీసోదరుల కీకారణమున లభ్యముగానినాఁ డమృతమెఱుఁగని నేను బుద్ధిపూర్వకముగా నా పూర్వప్రతిజ్ఞను దలఁచి యాత్మహత్యను గావించికొనెదను. ఈ యాత్మహత్య నీ యంగీకారమువలనఁ గానున్నదని గుర్తింపుము. ఇది నిన్ను జంకించుటకుఁ గాని, నీ దయాపేక్షకుఁగాని వ్రాసినదిగాదు. కాని మఱియొక యనర్థముగూడ జరుగునేమో! అది కేవలము విచార్యము. అష్టకష్టములుపడుచున్న నీ సోదరులు పట్టుదలగల నవాబుమూలమున మఱియు హింసింపఁ బడుదురేమో! అంతియగాదు. నీవు బందీవగుదువేమో! ఇది నిన్ను జంకించుటకు వ్రాసిన

ప్రాఁతగాదు. నామరణానంతరము నవాబును నయభయ ములఁ గొంచెమైన నిరోధింపఁగలవా రుందు రనుకొనను. జహానారాబీగము మరణము, వాఘోజీ సోదరుల సర్వనాశ నము, రాజపుత్రాంగనల మానహరణము అను ముప్పేటలు పడిన కరాళపాశము యమసముఁడగు నవాబు మూలమున నేర్పడును. దేశ మల్లకల్లోలమగును. రక్తవాహినులు ప్రవ హించును.

చెల్లెలా! విషయమిట్టిదిగానుండునని స్వరూప నిరూ పణము మాత్రమే పొనరించితిని. అంతియగాని నీవు నవా బును వివాహమాడి నాప్రాణసముద్ధరణము చేయుమని గాదు. ప్రాణముకంటె మానము గొప్పది గదా!

మనము వీరక్షత్రియాంగనలము. నరనరమున నరు ణారుణమై శౌర్యరసోపేతమై గంభీరనినాదముతోఁ బవిత్ర రుధిరము ప్రవహించుచున్నది. కాలకర్మములకుఁ గట్టు పడినను మనప్రతిభ మాసిపోదు. మాసిపోవఁ గూడదు. ఎన్నెన్ని రాజకుటుంబములు కటుకుఁ గత్తుల వాదరకు బలియైనవో! ఎందఱెందఱు మానవతులు స్వీయ గౌరవ రక్షణార్థము చితులఁ జేర్చికొని తమ పవిత్రశరీరములను పవిత్రతరమగు పావకాహారముగఁ గల్పించిరో! ఏయే స్థలములలో నేయేవేళలలో స్వాతంత్ర్యసమరాభిలాషులగు దేశభక్తులు కడగండ్లపాలయిరో! వారికంటె మనమెక్కుడా!

అమ్మా! ధైర్యము ప్రధానము. నడుముగట్టి కర్త వ్యము నిర్ణయింపుము. నీ నిర్ణయముపై సర్వము నాధార

పడియున్నది. నీ నిర్ణయమే యిప్పుడు విధి నిర్ణయము. భావి భాగ్యాభాగ్య విధాయి.

తల్లీ! ఒక్కమాట చెప్పెదను. క్షమింపుము. నవాబు స్త్రీలోలుఁడయ్యు, మద్యపానరతుఁడయ్యు సహజకోమల హృదయుఁడు. కఠినహృదయ మాతని యెడ లేదు. దైవభక్తిగలఁడు. ఔదార్యమున్నది. కృతఘ్నుఁడు గాఁడు. అతని శరీరమున నాతని పూర్వుల క్షత్రియరక్త మింకను బాఱుచునే యున్నది. యవనవాతావరణము, యవనసాంప్రదాయములు భూతప్రేతములవలె నాతని కీర్తిసీరజమునకుఁ బంకము గల్గించినవి. అతఁడు కేవల మయోగ్యుఁడని చెప్పఁజాలను. దీర్ఘముగనాలోచించి చేయఁదగినది చేయవలెను. ఈ విషయమున నీవు సర్వస్వతంత్రవు.

నావ్రాఁతయందు రోఁతమాటలున్నచో హృదయపూర్వకముగ మన్నింపుము. ధైర్యపాదుకల నెక్కి కష్టకంటక మార్గమును తరింపుము.

ఇది యాంతరంగిక లేఖగా భావింపుము. లేఖవాహకురాలు మత్సమాన గౌరవాదరములు పొందఁదగిన యుత్తమక్షత్రియాంగనగాఁ దెలిసికొనుము. లేఖాప్రాముఖ్యతను బట్టి యామెనే యీకార్యమునకు నియోగించితిని. ఆమె నిన్నాశీర్వదింపఁదగిన యోగ్యతగలదిగాఁ దెలిసికొనుము.

భగవంతుఁడు నీకు మేలుచేయును గాక!

అహమ్మదునగరము. సోదరి జహనారాబీగము."

ఈలేఖ చదివి లాలాబాయి గుప్పునఁ గూలిపోయెను.

# పదునాలుగవ ప్రకరణము

## (నిర్ణయము)

సరళ తబ్బిబ్బు పడెను. వెంటనే తగిన శైత్యోపచారములఁ బొనరించెను. లాలాబాయి కనులువిచ్చి చూచెను. 'నీవు సర్వనాశనకరమగు సందేశమును దెచ్చిన కఠినవు' అని పలికెను. సరళ మాఱుపలుకఁ జాలదయ్యెను. కనుగ్రుడ్డుల నీరు దిరుగుచుండ 'అమ్మా! క్షంతవ్యను' అని పలికెను.

లాలా॥ నేను నాయవస్థలో నిందించుటతక్క నీతప్పేమి యున్నది? పౌరుషహీనమైన భ్రాతృవర్గము, శక్తి విహీనమైన సామ్రాజ్యలక్ష్మికొఱకై నీతి విహీనమైన నవాబునంతిపురికి నన్ను విక్రయించుచున్నవి.

సర॥ శాంతిల్లుము. హృదయమును చెదరఁగొట్టికొనకుము.

లాలా॥ ఇంకెక్కడిశాంతి! ఇటుచూచిన నాత్మనాశనము, అటుచూచిన భ్రాతృనాశనము తప్పనిదిగా నున్నది. అంతియగాదు. జహనారాయాత్మహత్య సహింపరానిది.

సర॥ అమ్మా! జహనారాబీగము తనకు బదులుగా నన్ను పంపినదని భావింపుము. ఆమె బీగముగావున స్వేచ్ఛాసంచారమునకు వీలులేక రాఁజాలదయ్యెను. కష్టసుఖములు మానవనైసర్గికములు. అగ్నిపరీక్షలకు

మనము తాళికొనవలయును. మేలిపసిండి యొక్కటి యే యగ్నిజ్వాలల నిలిచి ప్రకాశింపఁగలదు. నీ వీ విషయమున నెంత కష్టపడుచున్నావో యంతకు ద్విగుణముగా నేను దుఃఖించుచున్నాను. ఇఁక బీగము విషయమో చెప్పవలనుగాదు. నీ వామె చెల్లెలివైతివి. నేను నీకుఁ దల్లివంటిదానను. మన సార నామెను క్షమింపుము. ఆమె యట్లే క్షమింప వలసినదిగా కోరినది. అట్లుకోరి నాయెదుట బోరున నేడ్చినది. ఆ దృశ్యము హృదయవిదారకము. మన మువ్వురము నొకే విధమగు నాపదలో నున్నారము. కర్తవ్యకరణము నీపైననే యాధారపడియున్నది. కాని రాణిపై గాదు. ఆమె ప్రాణములు, సోదరుల రాజ్యము నీహస్తములనిూఁదుగా నున్నవని చర్విత చర్వణముగాఁ జెప్పుచున్నాను.

లాలాబాయి మౌనముతో, దీర్ఘనిశ్వాసముతో, గంభీరవదనముతోఁ, గదలిక లేని చూపుతో నామెను జూచుచుఁ జెక్కిలిపై వామపాణితలముంచి, రూపొందిన లక్ష్మి విగ్రహమువలె నుండెను. సరళ యామె తీరును గాంచి మరల నిట్లు చెప్పఁ దొడంగెను:

'అమ్మా! నీవు బుద్ధిశాలినివి. నీకు ప్రత్యేకించి చెప్ప వలసినది గాన్పింపదు. కాని, బుద్ధిమదగ్రణులకైన నాపత్సమయమునఁ జెప్పవలసిన ధర్మమున్నది గావునను, నీ

యందు నాకుఁ బ్రణయమున్నది గావునను, జహానారా బీగము ప్రాణరక్షణయత్నము పుణ్యప్రదము గావునను నాకుఁ దోఁచిన విషయములఁ జెప్పుచున్నాను. మానవులకుఁ బరమపిత యొక్కఁడే. నరలోకమంతయు నాతని యనుంగు సంతానముకాన మతములు మానవకల్పితములు. ఆదినుండి మన భారతదేశము జాతివిభేద దవానలముచే మండిపోవు చున్నది. ఈ జ్వాలదనలము నార్పుటకు విశాలోన్నత భావగిరి నుండి స్రవించు దివ్యామృత ధారలు గావలెను. హైందవు లైనను ముసల్మానులైనను సమానులే! గుణమే ప్రధానము. జాతీయైకమత్యమునకు దేశాభివృద్ధికిఁ బాలనాభద్రతలకుఁ బ్రజాసౌఖ్యమునకు క్షీరనీరముల కలయికపోలె హిందూ మహమ్మదీయుల సమ్మేళన మావశ్యకము. ప్రసిద్ధ రాజ వంశములు, ప్రకీర్తిత మహమ్మదీయ కులములు పరస్పర ద్వేషానల మార్పికొనవలెను. ఏకైకజాతి గావలెను. నాఁడే దేశ చరిత్రమున మనము వన్నెకెక్కఁగలము. ఇందులకు జాత్యంతర వివాహములే సౌఖ్యసౌధములఁ జేర్చు భద్ర సోపానములు. జహానారాబీగమువంటి పవిత్రాశయురాలు అహమ్మదుషాను తిరస్కరింపలేదు. లోకులు మూర్ఖులుగాన నియ్యది దూష్యముగాఁ బరిగణింతురేగాని యిది యామె విశాలహృదయమునే దెల్పుచున్నది. ఇంక నవాబు విష యము. ఇతఁడు కన్నులుగానని కాముకుఁడే గాని కరుణకుఁ బెన్నిధి. దుర్నిరీక్ష్య తేజోవిరాజితుఁడు. సమర్థుఁడగు రాజు. ఈ విషయమై బీగమే నీకు స్వయముగా వ్రాసినది. కావునఁ

బునరుద్ఘాటనము పనిలేదు. ఇఁక నన్నిఁటికంటె నెన్నఁదగినది నీవు రాణికి సోదరివైమనుట. ఆ దేవతాంగనకుఁ జెల్లెలి వగుటకంటె సౌభాగ్యము త్రిలోక దుర్లభము. దీర్ఘకాలము నుండి నిర్మలిన క్షత్రియరక్తము పాఱుచున్న శరీరముగల నేను అహమ్మదుషా అంతఃపురమున నుండఁగలుగుట దేవతా స్వరూపిణియగు జహనారా ముఖసందర్శనము కొఱకే! తదీయసేవార్థమే! కావున వివాహాంగీకారము సర్వశ్రేయో దాయకముగా నాకుఁ దోఁచుచున్నది. ఇట్లని, నా మాటలనే ప్రధానములుగాఁ జేసికొనరాదు. నీకును నంతరాత్మ గలదు. వాఘేలీ వంశ పవిత్ర రక్తము నీగాత్రమునఁ బ్రవహించు చున్నది. బుద్ధిబలముగల యోగ్యురాలవు. తగిన స్వాతంత్ర్య మున్నది. వివేకమున్నది. వానినుపయోగించి యానతిమ్ము.'

లాలాబాయి విస్ఫారిత తరళనయన విద్యుత్తులతోఁ గాంతతర హరిణీశాబమువలె లేచి యామెను కౌఁగిలించికొని 'అమ్మా! నీవు దేవతవు. కర్తవ్య ముపదేశించితివి. వివాహము నంగీకరింతును. రాణి సహస్రమాసజీవి యగుఁగాత! సోదరులకు రాజ్యలక్ష్మియబ్బును గాత! ప్రజలు మతకలహములులేక సుఖియింతురు గాత' అనెను.

సరళ సంతోషించి దీవించి సెలవు గైకొని దనసేవకులతోఁ దరలెను.



# పదునైదవ ప్రకరణము

## (ప్రార్థన)

సరళ ప్రస్థానానంతరము లాలాభాయి కొంతవడి యట్లే నిలిచియుండెను. ఎన్నియో యాలోచనా తరంగ సంఘము లామె హృదయ సముద్రమునఁ బొడమి యడరి యడఁగుచుండెను. ఎడఁద కడలి భావనాఝంఝామరుత్తుచే సంక్షుభితమయ్యెను. నిరాధార గగనస్థలమునుండి పతన మగుచున్న పక్షవిహీనపక్షి సంతానమువలె నామె యింద్రియములు చైతన్యములేక సొమ్మసిలెను. తీరములేని వారిధి యందు దారి తెలియక పరిభ్రమించు నావవోలె, దావానల ముచేఁ జుట్టికొనఁబడిన హరిణశాబముభంగి, దిక్కుదోఁచక భ్రమాన్పడి యేమియో నిశ్చయమునకు వచ్చి తనలో తాను సరళను దలఁచి చిఱునగవు నవ్వికొని, పితృపితా మహకీర్తిని పంకిలము పఱుపరాదని తలంచికొనెను. సరళకుఁ దానొనరించిన వాగ్దానమును దలఁచికొనెను. తుదకేదియో స్థిర నిశ్చయమునకు వచ్చి నిస్తరంగనీరధి ననుకరించెను. ముఖము గంభీరమై యందొక నూతన తేజస్సావిర్భవించెను.

అచటనుండి కదలి స్నానశాలకుఁ బోయెను. సుస్నాతయై, ధౌతవసనధారిణియై తిన్నగా గృహదేవత యగు భవానీ దేవియాలయమునకుఁ జనెను.

సముచితరీతి సమీపించి, పాదాభివందన మాచరించెను. నిశ్చలహృదయయై యేకాగ్రచిత్తయై త్రికరణముల దేవిని ధ్యానించెను.

అనంతరము కన్నీరుగారఁ దద్విగ్రహ పదాబ్జములు బాష్పవారిపూరముచే నభిషిక్తములగుచుండఁ దల్లి చెంత బిడ్డ విన్నవించురీతిని గద్గదస్వరముతో విన్నవించెను.

'భగవతీ! నమోవాకములు. నీ కృపావీక్షణముననే సర్వజగములు నియమబద్ధములై నడచుచున్నవి. నీ యాజ్ఞానుసారమే పంచభూతములు తమ కర్తవ్యముల నిర్వర్తించుచున్నవి. సర్వస్థలముల వ్యాపించి శతకోటి నేత్రములతో సర్వము నాలోకించుచు హృదయగతాభిప్రాయములను దెలిసికొనుచుఁ బాపపుణ్యములకు సాక్షిభూతవై యుండు నీవు నన్ను నేఁడు సంపూర్ణముగ ననుగ్రహించు సమయము వచ్చినది.

దేవీ! నాకు హృదయము చలించిపోవుచున్నది. కరాళాగ్నిపరీక్షలో మేధ కరఁగిపోవుచున్నది. దిగ్భ్రాంతి దీనత సంక్రమించినది. ఇట్టిసమయములో నీ యనుఁగుబిడ్డ నగు నాకు, నీ చరణదాసినగు నాకు, నీ పాదధూళినగు నాకు సంపూర్ణహృదయబల మిమ్ము.

నా పూర్వులు పవిత్రరాజకుల కళంకమును గల్పింపని హృదయముతోఁ గల్మషనైర్మల్యములుగాని కరములతో నిన్నుఁ బూజించిరి. నేనును నేఁటి దనుక తత్పదానుగమ్య

మానసనై తరలని భక్తితో తావక పదాంభోజ సేవ సల్పితిని. నీవును నిర్నిమేషనేత్రములతో నిరంతర కటాక్షవీక్షణముల నాదెసఁ బఱపుచున్నావు. అందులకు శతసహస్ర నమస్కారములు.

కాని నేఁడు తలపై పిడుగుపడనున్నది. తప్పించుకొనఁ జూచుట వెఱ్ఱి. మానరక్షణము, లోకశాంతి, సోదరసౌఖ్యమును గల్పించు నుత్తమోపాయ మొకటి నీ కరుణచేఁ దోఁచినది. దానిని నిర్వర్తించు నిరవధికనిస్తుల శక్తిని బ్రసాదింపుము.

ఏయే విషయముల నేయే సమయముల నిన్ను సేవించి యేయేపుణ్యముల సంపాదించితినో యయ్యవియెల్ల నేఁడు నీదయావలోకనమున సఫలీకృతమనోరథగాఁగల హృదయశక్తిని గల్పించుఁ గాత!

నాహృదయగతాభిప్రాయముల నీ వెఱుఁగుదువు. నావేదనము నీ వెఱుఁగుదువు. ప్రత్యేకించి విన్నవింపనేల? ప్రజ్ఞలేని బాలికను, లోకమర్మముల నెఱుఁగని ముద్దరాలను. అనుభోక్తవ్యమైన కర్మఫలము ననుభవించుచున్నాను. ఈయంధకారమునందు దారిదివ్వె వగుము. ఈ యగాధసముద్రమున భద్రనౌక వగుము. ఎన్నిరీతులఁ జూచినను నే కాలమందైనను నీవే శరణ్యము.

నాకార్యమున కంతరాయము గలుగకుండుఁ గాత! అమ్మా! ఆత్మశక్తిని గరుణింపుము. ఇయ్యవియే నాప్రణామసహస్రములు'

ఇట్టు లామె ధ్యాననిశ్చలమై నివాతదీపకళికవలె సుస్థిర తేజస్స్వరూపిణియై యుండునంత వాథోజీసోదరు లందు ప్రవేశించిరి. వారు నేఁటి యామెభక్తి ప్రపత్తులను గాంచి యాశ్చర్యనిమగ్నులైరి. ఆమె వారి కన్నుఁగవలకు సాక్షాత్కరించిన శంభురాణివలె నుండెను. వారొకవైపున నొదిగి నిశ్శబ్దముగ నుండిరి. కన్నులమూసికొని, పెదవులఁ గదపుచు ఘటికామాత్రకాల మామె పరదేవతాసేవన మొనరించి యనంతరము కనుదమ్ములను విచ్చిచూచెను. ఆమె కనులలో నాధ్యాత్మిక కిరణజ్యోతి ప్రస్ఫురితమగుచుండెను. దేవీప్రసాదమును గైకొని యనంతరము సోదరులనుగాంచి భ్రాతృభక్తి యుట్టిపడ 'అన్నలారా! ప్రసాదము స్వీకరింపుఁడు. దేవి మిమ్మాశీర్వదించుఁ గాక' అని పలుకుచు నన్నపూర్ణయువోలె నందిచ్చెను. వారు దానిని సభక్తికముగఁ గైకొని కన్నులకద్దికొనిరి. అనంతర మిట్లుపలికిరి :

'లాలా! నవాబు ఆహ్వానము ననుసరించి ఱేపే మన ప్రయాణము.'

లాలా॥ సంతోషము. మీరు సుఖులరై యుండినచో నాకును
సుఖమే గదా!

ఇట్లనుచు నామె వారికడనుండి సెలవుగైకొని తన మందిరమున కేఁగెను.



# పదునాఱవ ప్రకరణము

## (వివాహము)

పెంచుట యనవసరము. నిర్భాగ్యురాలగు లాలా వివాహము నవాబుతో జరిగి నేఁటికిఁ బదిదినములు దొరలి పోయినవి. ఈ హిందూమహమ్మదీయ సమ్మేళనమునకుఁ బలువురు పలువిధముల విమర్శింపఁజొచ్చిరి. నిష్కళంక రాజ పుత్రయశోంబరము కళంకితమయ్యెననియు, సోదరులు శాశ్వత మగు వైభవముల నాసించి, వంశగౌరవ మమ్ముకొనిరనియు గొందఱు రాజపుత్రులు మిక్కిలి యీసడించి మిక్కిలి ఖేద పడిరి. ఇంతకుఁ బూర్వమే నవాబుధాటికోర్వఁజాలక వంశ మానములఁ గళంకితమొనర్చికొనిన రాజపుత్రు లెంతయు వాఘోజీసోదరులను శ్లాఘించిరి. నిజమేగదా! చెడినవారు చెడినవారినిఁజూచి సంతసింతురని కొందఱువారినిఁజూచియను కొనిరి. మఱికొందఱు సంస్కారప్రియులు హిందూమహమ్మ దీయ సమ్మేళనముచే దేశము సముద్ధరింపఁ బడుచున్నదని భావించిరి. లోకము పలుతెఱఁగులు గదా!

ఏదియెట్లున్నను నేఁడు వాఘోజీజితోజీలు నవాబునకు బావమఱదులు. లక్ష్మీకటాక్షము, అధికారగౌరవమునుపొం దినవారు. వారినావరించిన దారిద్ర్యభూతము లాలాబాయి వివాహమంత్రోచ్చాటనముతోఁ దొలఁగిపోయినది. నవాబు చే బలాత్కృతముగఁ గైకొనఁబడిన రాజ్యమంతయు పునర్ల భ్యమగుటయేగాక నూతనముగ మరల నైదువందల గ్రామ

ములు బిరుదములు దుస్తులు మున్నగువానిచే సత్కరింపఁ బడిరి. ఒక్కొక్కరు పదివేలదళమునకధిపతులుగానియమింపఁబడిరి. ఏయేరీతుల నెన్నెన్నివిధముల సన్మానములు జరుగవలెనోఅన్నియు నానందోన్మత్తుఁడు, కామవ్యాపార పారీణుఁడు నగు నహమ్మదుషాచే జరుపఁబడెను. వేయేల, నేఁటిసోదరులు తాము స్వప్నములయందుగూడ నూహింపఁజాలని మహత్తర భోగభాగ్యములలో మహోన్నత ప్రాసాదములలో నున్నారు. లక్ష్మీపరిష్వంగమునఁ జిక్కి యానందించుచున్నారు.

మహారాజ్ఞి యుదారశీలయగుజహనారాబీగముప్రాణమీా వివాహబంధమూలమున నిలువఁబడెను. ఆమెయానందమునకు మేఱలేదు. లాలాబాయివంటి యుత్తమురాలు తన ప్రణయనిధిలో నర్ధభాగముగొనుట యామె కసూయాకారణముగఁ గాలేదు. నవనవయావనోపేతము, సుస్నిగ్ధపేశలతాయుతము, నిస్తులసౌందర్యవిరాజితము, క్షణక్షణవర్ధమానలావణ్యము నగు లాలాబాయి మూర్తీభవించిన సౌందర్య దేవతవలె వచ్చినను నామె కించిత్తేనియునీర్ష్యపడలేదు. మీాఁదు మిక్కిలి యట్టిసోదరి లభ్యపడుటకు తనపూర్వజన్మసంపాదితాదృష్టమే కారణమనియు, నట్టివనితామణి నర్ధాంగిగాఁబడయుట 'అహమ్మదుషా' పుణ్యైకమూలమనియు భావించుచు నామెకు బహిఃప్రాణమై యుండెను. లాలాబాయిని విడిచి నిమిషముండదు. ఆమెయే తనకన్నుల కమృతజ్యోతి. ఆమె పలుకులే తనకు సుధాహారము. ఇట్టి యుదార శీలము నిరుపమానమై స్త్రీజనశిరోధార్యమై దేవతావంద్యమైన మహత్తరగుణము గదా!

అయిననేమి! లాలాబాయి హృదయ మెట్టిదిగానున్నదో దెలియదు గదా! ఆమె యభ్యంతరంగభువనమున నెట్టి యగ్ని పర్వతములు పగులుచున్నవో యెఱుఁగఁదు గదా! ఆ యుత్తమశీల శీర్షభ్యంతరమున నెట్టి వ్యథావిషానిలములు వీచి బాధించి పగులఁదీయుచున్నవో యెఱుఁగదు గదా! ఆమె యానందమే యనుభవించుచున్నదో, చింతానల ప్రతాప తాపితయేయై యున్నదో తెలియనుగాని, యామె ముఖమున నెట్టి విషాదచ్ఛాయలు గాన్పింపవు. రాజ్ఞీమణి ప్రాణములు నిలుపఁగలుగుట, సోదరరాజ్యలబ్ధికి తా నుపకరణమగుట యను విషయములు దలంపునకు వచ్చినపుడెల్ల నామె యానందమునకు మేర లేకుండెను.

నూతన వధూవరుల సమాగమ దినముగా శుభ ముహూర్త మేర్పఱుపఁబడెను. ఇంతవఱకు 'అహమ్మదుషా' హృదయము లాలాబాయి సన్నిధానముననే యుండెను. గాలి పటము స్వేచ్ఛగా నెగురుచున్నటులఁ గాన్పించుచున్నను బాలకుని చేతిలోపలనే దాని సూత్రముండునట్లు అహమ్మదుషా హృదయము లాలాబాయి సౌందర్యహస్తగతమై యుండియు, శరీరము మాత్రము విధిలేక వలసినచోట్ల సంచారము చేయుచుండెను. ఇంతవఱకతఁడు హిందూమర్యాదల ననుసరించి లాలాబాయిని చూడలేదు. పలుకరింపలేదు. కాని హృదయము లాలాబాయి సౌందర్యమును దలఁచి యౌవనమును దలఁచి యాలోచింపని నిమిషములేదు.

ప్రథమసమాగమ నిర్ణీతదినమున మహారాణి పొంగి పోయెను. ఆతనికి లాలాబాయినర్పింప నామె యమాయిక హృదయము తొందరపడుచుండెను. లాలాబాయిని రాజ్ఞీమ ణికిఁదగిన వస్త్రాభరణములచే జహానారాబీగ మలంకరించి తనలోతానే యాశ్చర్యపడి 'ఈమె దేవకన్య కాదుగదా! ఇట్టియందము సృష్టిలో దుర్లభము.' అని తలఁచెను. స్త్రీ యయ్యు తన స్త్రీత్వమును మఱచి ముద్దిడుకొనెను. మరల మరల నలంకరించెను. పునః పునః పరిశీలించెను. దృష్టి దోషము దగులునేమోయని భయపడెను.

ఆమె ఏమిచేయుచున్నను లాలాబాయి యేమియు నడ్డుచెప్పలేదు. గౌరవాదరములతోఁ జూచుచు 'సవతి మచ్చరములేని మానినిగదా' అని యనుకొనెను. 'నా హృదయ మీామెకుఁ దెలియదుగదా!' అని లోలోనఁ జిం తించెను. శతధా జహానారాబీగమున కానందము గూర్చు టయే యామె ముఖ్యోద్దేశము. రాణియన్న నామెకు దేవత. ఆమె నౌదార్యఖనిగా, దుర్లభదేవతగా లాలాబాయి తలఁచుట క్రొత్తకాదు గదా!

రాజ్ఞీమణి యానందమునకు మేఱలేదు. తానెంతయో ఘనకార్యమాచరించితినని యామె యమాయిక బుద్ధితో ననుకొనుచుండెను.

విలంబనములతో వర్ణనములతో విసిగింప దలఁపు లేదు. సాయంకాలమయ్యెను. సంధ్యాకాలము దాఁటెను.

నక్షత్రగమన మయ్యెను. చంద్రోదయము సంభవించెను. వెన్నెల లరుదెంచెను.

లీలాబాయి నేఁడు నిరవధికానందమతియై గన్పట్టుచుండెను. సుస్నాతయై దైవమందిరమునకుఁబోయి ప్రార్థన మొనరించెను. దైవప్రసాదమును గనులకద్దికొని యారగించెను. భోజన మొనర్చెను.

రాజ్ఞీమణితో డ్తేఅ గంభీరయై పడకటింటికి వచ్చెను. అచ్చట నంతకుఁబూర్వమే 'అహమ్మనుషా' యామె రాక నిరీక్షించుచు మృదులతల్పముపై హుక్కాత్రాగుచుఁ గూర్చుండియున్నాఁడు.



# పదునేడవ ప్రకరణము

## (ఆత్మబలి)

ఆమెరాకను గాంచిన యహమ్మదుషా ఆనందమునకు మేరలేకపోయెను. ఉత్థితుఁడై యెదురేఁగెను. మహారాజ్ఞి యామె నచ్చటవిడిచి చిఱునగవుతో వెడలిపో నుండెను. అంతలో లాలాభాయి యామె పాదములను తలవనితలంపుగా స్పృశించెను. ఆస్పర్శతోఁబాటు రెండు కవోష్ణబాష్పబిందువు లామె పాదపద్మములపైఁ బడెను. జహనారాబీగము దిగ్భ్రమనుచెంది లేవనెత్తి 'చెల్లెలా! భయములేదు' అని ముద్దిడుకొని వీఁపుతట్టి వెడలిపోయెను.

అచ్చట అహమ్మదుషాయు లాలాబాయియు మాత్రమే యున్నారు. సంపూర్ణముగ సౌందర్యోపేతముగ నలంకరింపఁబడిన పడకటింటియం దమూల్య సుగంధకర్పూర దీపములు వెలుఁగుచున్నవి. ప్రకృతియంతయు నిశ్శబ్దముగా నున్నది. అప్పుడే పంౘ్రెండుగంటల నగారా మ్రోఁగెను. ఒకరి నొకరు పలుకరించికొనలేదు. అహమ్మదుషా యామె సౌందర్యమును, ఠీవిని గాంచి యామె తనయర్థాంగియని తెలిసియు, దేవీసన్నిధానమునకుఁ బోవ జంకెడు రాక్షసునివలె దూరముగా నిలుచుండియుండెనేగాని పలుకరింపనైన సాహసింపలేదు. తుదకెట్లో సాహసించి 'దేవీ! నాఁడు నిన్నుఁ జెఱపట్టి తెప్పింపఁ బ్రయత్నించిన యీ దాసుని మనసార క్షమింపవలెను' అని మాత్రము పలుకఁగలిగినాఁడు. ఆమె యెట్టిజవాబు నీయలేదు. రెండునిమిషములు, మూఁడునిమిష

ములు దొరలిపోయినవి. 'ప్రేయసీ! రాజపుత్రికలకు దీర్ఘ కోపములుండును గాఁబోలు! అట్టివాని నమాయికుఁడనగు నాపట్ల చూపకుము. నేను నీదాసుఁడను' అని పలికినాఁడు.

లాలాబాయి మాఱుపలుకలేదు. తలవంచికొనియే నిలుచుండినది. మేలిముసుఁగు గూడఁ దొలఁగలేదు. అహమ్మదుషా కాముకుఁడయ్యు సరసుఁడుగావున 'దేవీ! నాయం దెట్టి దోషమున్నదో తెలిపి నన్నేలికొనుము' అని పలుకుచు సాహసించి దగ్గఱకువచ్చి మేలిముసుఁగును మెల్లగాఁ దొలఁగించినాఁడు.

అహో! ఆశ్చర్యము! ఆమెయందము! అయ్యది వానిని దిక్కుదోఁచనివానిఁగాఁ జేసినదని చెప్పినఁ జాలును. కాని యామె పద్మసఖమగు ముఖమునఁ గన్నీటిబిందువులు ముత్యములవలె జాలువాఱుచున్నవి. నయనము లుబ్బియున్నవి. తటాలున మేలిముసుఁగును సవరించికొని దూరముగఁ బోయెను. అంతట నిబ్బరములేని యా కాముకుఁడు 'దేవీ! దుఃఖింపనేల? నా యపచారములు క్షమింపుమా., నేను నీకు నిరంతరము దాసుఁడను' అని పలుకుచుఁ జేరవచ్చెను.

అంత లాలాబాయి కన్నెత్తిచూచెను. ఆమెచూపులు నిశితములై విద్యుద్రేఖలఁ గ్రక్కుచుండెను. ముఖము గంభీరమై వినమ్రమై యుండెను. ఆమె కలకంఠ కంఠముతో ముక్తకంఠియై యిట్లు పలికెను:

'ప్రభూ! మీరు నాకు దాసులు గావలదు. మీకు నే నర్ధాంగిగా నేర్పడియే యున్నాను. మీదాస్యమును గోరియే

గదా నా సోదరులు నన్ను మీచరణదాసిగా నర్పించినారు! విశాల విశ్వంభరాస్థలిగూడ మీకు దాస్యముచేయుచున్నది గదా! అనేక రాజపుత్రాంగనలు మీ పాదపద్మ సేవాలోలురై యున్నారుగదా! జహనారాబీగమువంటి పవిత్రాంగనయే మీ చరణదాసిగదా! అట్టిచో మీరు నాకుదాసులై యామె యెడ నపచారముగావింపకుఁడు. ఆమె సేవకు సతీత్వమునకుఁ గృతఘ్నులు గాకుఁడు.

నాఁడు బంధించి తెచ్చితిననియు నందులకు క్షమింపుమనియు నేఁడొక యబలను, నిస్సహాయను, నన్ను,వంటింటి కుందేలువలె ,నీ పడుకటింటియందున్న కాంతను గోరుచున్నారు! అది తప్పు. కేవలురుగాని మహావీరులను భయద రణరంగమున మూఁడుచెఱువులనీళ్లు త్రావించి ముప్పతిప్పలు పెట్టఁగలిగిన మీర లిట్లు కేవల మొక యబలాసన్నిధానమునఁ బలుకుట తుచ్ఛమగు ఈ తనువు నాసించిన కాముకత్వము చేతనేగదా! ఇట్టి మోహలాలసత్వము, ఇంద్రియ బానిసత్వమేగదా యబలాదాసుఁడనని మీచేతఁ బలికింపఁ జేయుచున్నది. ఇది యవమాన సమర్హమగువిషయమేగదా!

మఱచితిని. నాఁడు బంధించి తెచ్చితి నంటిరిగదా? నాఁడు నా మానము జహనారాబీగము గాపాడఁ గలిగినది. కాని, నేఁడు నా గౌరవము నెవ్వరు గాపాడఁగలరు? అర్ధాంగీ రూపమున వాఘేలీ రాజవంశజను, సురక్షిత మందిరము నుండి నీ యంతఃపురమున నీ యర్ధరాత్రమున నీ కేళికాగారమున నీ సమక్షమున, నే సమ్మతించినను సమ్మతింపకున్నను నీ యనుభవమునకే, నా పాపకర్మానుభుక్తికి సిద్ధ

ముగా నున్నాను గదా! నేఁడు కోటి జహానారా బీగములు గాని, శతకోటి సైనికులుగాని నన్ను గాపాడఁజాలరు గదా!

స్వామీ! నాఁడు చెఱపట్టుటకు నేఁటి ఈ పరిస్థితికి భేదములేదు. అయినను నాకు ఖేదములేదు.

సోదరుల రాజ్యము, జహానారా ప్రాణము నిలుపఁ గలిగితిని. ఇంతకంటె ఘనమగు కార్యమును ఈ శరీర మును అమ్మిగాని నమ్మిగాని యేమిచేయఁగలను? భౌతికము, పరిణామ స్వరూపము, ఆహార సంకర్షకము, నశాశ్వతము, రోగసదనమును నైన యీ నీటిబుడగను మీ రాసించి యింతటి మహోపకారము చేయఁగా నే నేల సమ్మతింప కుండవలెను?

కాని, ప్రభూ!' అని పలుకుచు నుద్రేకవశమునఁ బగులుచున్న గుండియల నదుముకొనుచు లాలా యిట్లు పలికెను:

'నేను యోగిని గాను. మానావమానములఁ బాటిం చు భౌతిక ప్రపంచమున మెసలుదానను. రాజసము, వంశ మర్యాద మాకు వెన్నతోఁబెట్టిన విద్య. ఉగ్గుతోఁ ద్రావిం చిన యీ క్షాత్రరస మింకను ఆఱిపోలేదు. లోకములో మానాధికమగు పదార్థము వేఱొండులేదు.

మహమ్మదీయునకు వివాహితనైతినని లోకమంత టికిఁ దెలియును. నా సౌశీల్యతను లోకము తప్పక యవమా నించును. కాని, యీ కళంక పంకమును నిశ్శేషముగాఁ బ్రక్షాళించి కీర్త్యంబరమును స్వచ్ఛముగాఁ జూపఁ గల

కార్యవిధానము నా చేతులలోఁ గలదు. అయ్యది నాశక్తికి మించిపోలేదు.'

ఇట్లు పలికి శాంతవినయ గభీరయై యిట్లు మరల పలికెను: 'ప్రభువా! ఆగ్రహింపకుఁడు. నిన్నుఁ జూచిన నాకు జాలియగుచున్నది. చక్రవర్తి స్థానమును పూర్వజన్మశత సుకృత ఫలితముగాఁ బొందితిరి. విద్యావివేక సంపన్నత్వము గలదు. అరివీర కంఠ లుంఠనశక్తి బాహువులలో నున్నది. పరిపాలనాదక్షమేధ గలదు. అట్టి మీరు మానినీజన మానాపహరణమునకు మద్యపానమునకు లోనగుట యెంత యపచారము! దీపముండియు దీపమార్చికొను చున్నారు. చేత రత్నముండియు బిచ్చమెత్తుచున్నారు. లోకము మిమ్ముఁ దలంచి తల్లడిల్లి పోవుచున్నది. మానవతులగు రాజపుత్రాంగనలు కలలోసహితము నిదురరాక మిమ్ముఁ దలఁచి భయపడి గుండియలువగుల రోదించుచున్నారు. ఈ తుచ్ఛ తనువుపై నింత మమకార విభ్రాంతు లేల? ఇం దేమి యసాధారణ విశేషము గలదు?

మీకు నచ్చినను నచ్చకున్నను నే నొక్క హితోపదేశము చేయుచున్నాను. సతీమతల్లియగు జహానారాబీగమునకు అపచారము సలుపకుఁడు. ఆమెను గాదని యన్యకాంతను గోరకుఁడు.

నా సోదరులును ఆశాబద్ధులై నన్ను విక్రయించినను స్వామిద్రోహులు గారు. కృతఘ్నులు గారు. నరనరంబునఁ బరమ శౌర్యప్రతాపములు తొలఁకు పవిత్ర వీరరక్తము

ప్రవహించుచున్నది. వారు నీ కడనుండిరా మీ రెన్నికార్య ములనైన సాధించికొని రాజ్యము నిష్కంటకముగ, నిరుప ద్రవముగఁ బాలింపఁ గలరు. కుటిల రాజనీతి మర్యాద నను సరించియైన, రాజ్యక్షేమార్థముగా వారిని విడువ వలదు.

మిమ్ము నేను మోసగించితిని. ఇందులకు భగవంతుఁ డు విధింపనున్న యెట్టి శిక్షనైన భావి భవములలో సంతో షముతో ననుభవింతును. కాని నా యీ శరీరమును తాఁకు టకుఁగాని, కన్నెత్తి చూచుటకుఁగాని మీ కధికారము నే నీయఁజాలను. ఈయను. ఇది పరమేశ్వర దత్తశరీరము. మహత్తరమగు రాజ్ఞీమణి ప్రాణమును గాపాడుటకు, సోదర రాజ్య ప్రాప్తికి, వారి సాహాయ్యమున మీరు నిష్కంటక ముగ రాజ్యమేలుటకుఁగాను నే నీ వివాహమున కొడం బడితినని యింతకుపూర్వమే చెప్పియున్నాను. అంతియగాని తుచ్ఛకామసుఖముల నీ మూలమునఁ బడయుటకుఁగాదు.

నేను రాజపుత్రాంగనను. తరతరంబులనుండి సు ప్రసిద్ధము, స్వచ్ఛము, అవమానరహితము నైన పవిత్ర రక్తము శరీరమునఁ బాఱుచున్న వీరోత్తముని పుత్రికను. నాజనని వీరపత్ని. అట్టినేను పితలకుఁ గళంకము తేఁజాలను. మీకర్ధాంగి నైతిననుమాట మాత్రము నా ప్రారబ్ధవశమునఁ దప్పకున్నను, నిట్టిపనుల మూలమునఁ గొంత వఱకైన లోకో పకార పుణ్యము సంపాదించితినను విశ్వాసమువలని యూ రట గలదు. కానఁ జింతింపను. అదిగాక యీ శరీరము అప

విప్రము గా లేదని, కాఁజాలదని లోకమునకు నేను నేఁడే వ్యక్తము చేసికొందును.

ప్రభూ ! నన్ను క్షమింపుఁడు. మీదృష్టిలో నేను ద్రోహమూర్తిని. వివాహమునకొడంబడి, పరిణయానంతరము పడకటింటికివచ్చి ధిక్కారమొనర్చిన నీచురాలిగా మీదృష్టి లోనున్నాను. మీకుఁ గోపకారణగా నున్నానని నాకుఁ దెలి యును. కాని నేనేమిచేయఁగలను? నేను దురహంకారిణిగ, నీచనుగా భావమున్నచో నేనేమి యనఁగలను ? మీ పాద ములపైఁబడి వేఁడికొందును.

నేను మిమ్ము దూషింపను. మీ యజ్ఞానమునకు మాత్రము జాలి చెందుదును. ప్రభూ, నాయంతిమమగు కోర్కె యేమనఁగా నిఁకముందెన్నఁడు నావంటి రాజపు త్రికలను నంతఃపురమునకుఁ దెచ్చికొను యత్నమునకుఁ గడంగకుఁడు. దేవుఁడు మిమ్మాశీర్వదించుఁ గాక !

మహమ్మదీయ కులమునకుఁ గోడలైపోయెనను నప యశఃపంకమును నేఁడు నాశుత్రరుధిరమను పవిత్ర భాగీ రథీ తోయములచే గడఁగివైచుచున్నాను. ప్రాణము లెంత నిర్లక్ష్యములై మాదృశులకుఁ గాన్పించునో, మానమెంత పవిత్రమై గోచరించునో భవాదృశులు నేఁడెఱిఁగికొందురు గాక ! బలముగలదని, సంపదగలదని, యధికారము గలదని, సర్వము తనకులోఁబడునని తలఁచు నీవంటి పరిపాలకులు తమ బలసంపదధికారములు తృణమునకుఁ గొఱగానివని

నేఁడు త్రికరణములఁ దెలిసికొందురు గాక! పరాత్పరుఁడు నాయీకృత్యము నానందముతో సమ్మతించునుగాత!

పరలోకమునకు మహమ్మదీయుల కరవాల ద్వారమున నేఁగిన నాపవిత్రజనకుని పరమప్రపూతాత్మ తన ముద్దుల తనయయొక్క మానరక్షణచణమైన రక్తముచే తర్పితమగునుగాక! పవిత్రభరతమాత నన్నాశీర్వదించునుగాత!'

అని పలుకుచు మెఱుపుమెఱసిన చందమున మొలనున్న సన్నని బాకును దీసి కంఠప్రదేశమునఁ బిడివఱకు దిగునట్లు తటాలునఁ గ్రుచ్చికొని రక్తప్రవాహమున లాలాబాయి నేలఁబడిపోయెను.

కామాంధ్యముచేతను, మదిరాపానముచేతను, రూపవిలోకన విభ్రాంతిచేతను స్తబ్ధుఁడై ప్రపంచమే మఱచియున్న అహమ్మదుషా యిప్పుడు జరిగినవిషయము గ్రహించుకొనెను.

ఇంతలో ద్వారము పగులునట్లు కేకలు వేయుచు 'తలుపు! తలుపు! తీయుము తీయుము!' అను జహనారా కాతర స్వరము వినఁబడెను.

# పదునెనిమిదవ ప్రకరణము

## (ఆత్మబలి యనంతరము)

అహమ్మదుషా చిత్రప్రతిమవలె నిశ్చేష్టుండై యుండుటచేతం దలుపుతీయుటలోఁ గొంతజాగయ్యెను. కాని యింతలో లబ్ధసంజ్ఞుండై కవాటము దెఱచెను. జహనారా కంపితస్వరముతోఁ గంపమాన శరీరలతికతో దుఃఖించుచుం, బ్రాణప్రయాణములో నున్న లాలాబాయిచెంతం బడిపోయెను. 'సోదరీ! సోదరీ! పలుకవా! నీశీలమెంత పవిత్రమైనది! నన్ను క్షమింపవా? క్షమింపవా?' అని పిచ్చికేకలు వేయసాగెను.

లాలాబాయి కష్టముపై కనుఱెప్పలెత్తి చూచి మెక్కువప్రయత్నమున రెండుచేతులుచేర్చి నమస్కరించి ప్రక్కవాటుగా నొఱంగి ప్రాణములను విడిచెను. అంత రాణియు నహమ్మదుషావైపు సాభిప్రాయముగం జూచి తలవ్రాల్చికొనెను. అంత నహమ్మదుషా 'ప్రేయసీ! నేనేమియు నీమె శీలభంగమునకుం దలపెట్టలేదు. కాని, వివాహపూర్వమే ఈమె నిశ్చయము దెలిసియుండిన బాగుండెడిది. నే నీమెను హత్యగావించితినని లోకు లనుకొనెదరేమో! వాఘోజీసోదరు లనుమానింతురేమో! ఈ యకాలప్రళయము నాదూరదృష్టిహీనతచే నేర్పడినది' అనెను.

అంత రాణియిట్లనెను: 'ప్రభూ! అట్టికళంకము మీకు రాదు. అట్టిదిరాకుండ యీ యుదారచరితయే చేసినది!' అనుచు లాలాబాయి తనకువ్రాసి తనగదియందు వైచిన లేఖను చూపెను. అహమ్మదుషా యిట్లు చదివికొనెను:

'సామ్రాజ్ఞి జహనారాబీగమునకు మీ ప్రియమైన చెల్లెలు లాలాబాయి కడసారి ప్రణామములు.

నీ పవిత్రప్రాణములు నిలుపుకొనుటకు, నాసోదరులు లబ్ధసర్వస్వులగుటకు నభినయించిన వధూపాత్ర యీనాఁడు నవాబుగారి పడకగదిలో విసర్జించి, నన్నీయాటకై పంపిన జగన్నాటక సూత్రధారిని చేరఁబోవుచున్నాను.

నేను సుప్రసిద్ధ క్షత్రియబాలికను గావున, నొంటరిగానున్న 'అహమ్మదుషాను' నేనే నానిశితకరవాల మూలమున వధింపఁగలను. అందుపై బలపరాక్రమకుటిల రాజనీత్యుపేతులగు నాసోదరులు సర్వరాజ్యము గబళింపఁగలరు. అయినను నీకు వైధవ్యమును దెచ్చిపెట్టుపాపమునకుఁగాని, మహమ్మదీయ కరగ్రహణము చేయఁబడిన యీ తనువును నిలిపికొనుటకుఁగాని, మాననీశీలచోరుఁడయ్యుఁ బరిపాలనాదక్షుఁడగు నీతని బాహుదుర్గమునుండి రాజ్యము నగతికముగాఁ దప్పించుటకుఁగాని యిచ్ఛలేకుండుటచే ఆ పని నాయధీనములోనిదయ్యుఁ జేయను. నాశీలమును గాచికొనుటకుఁగాను నా బుద్ధిపూర్వకముగ నాకై నేను నవాబునకుఁ గొంత హితబోధగావించి యనంతరము ప్రాణత్యాగము చేయుచున్నాను. ఈ ప్రాణముక్తి నవాబుమూలమున నైనదని నా కళేబరమును జూచినయనంతరము దలఁపకుఁడు. అట్టి యపనింద యాతనిపైఁబెట్టి యంతఃకలహములు రాజ్యమునఁ జెలరేఁగజేయుట కిష్టములేక యీ విషయము వ్రాయుచున్నాను. నవాబు కేవలము నిర్దోషి. పెండ్లాడియు నాతని మోసగించి పరలోకప్రయాణమునకు సమకట్టిన నేనే యాతని

యెడ నపచారమును సలిపితిని. నీవుత్తమురాలవు. కేవల దేవీస్వరూపిణివి. నీవుండుటచేఁ బ్రజలకుఁ గన్నబిడ్డలకుఁబోలె సుఖముగలదు. కావున నీవు దీర్ఘకాలము జీవింపుము. నా తప్పులను మనఃపూర్వకముగ క్షమించి నాకుత్తమలోకములు గలుగునట్లు పరాత్పరునిఁ బ్రార్థింపుము. నా సోదరులకుఁ గడ సారి ప్రణామములు దెలుపుము. హిందూమహమ్మదీయ సౌఖ్యమునకై అహమ్మదుషా నిరంతరము పాటుపడఁ బ్రార్థించు చున్నానని నా తుదివాక్కుగా నవాబునకు విన్నవించి నా యీ యాత్మవధోద్యోగమును క్షమింపవలసినదిగాఁ గోరుము. నా సోదరులసాయమున, నీబుద్ధిబలమున, బలశాలియగు నహమ్మదుషా రాజ్యపరిపాలనము సక్రమముగా సాగించు నట్లు భగవంతుఁ డనుగ్రహించుఁగాక! సోదరీ! సెలవు. నన్ను మఱచిపొమ్ము. ఇట్లు నీ చెల్లెలు, లాలాబాయి.'

ఈ లేఖను బఠించిన యహమ్మదుషా హృదయము ద్రవీభూతమయ్యెను. లాలాబాయి సౌజన్యతయు, మహత్తర త్యాగమును, శరీరమును బులకరింపఁజేయ రక్తమునఁ బొరలాడుచున్న యామెపవిత్రకళేబరమును జూచి కన్నుల నీరు విడిచెను. హిందూమతము రాజపుత్రిశౌర్యము అనువాని మహత్తరమహిమను దలఁచి స్తంభితుఁడయ్యెను. హృదయమున సంస్కార బీజములు మొలకలెత్తెను. అప్రయత్నముగ 'దుర్లభరత్నము జాఱిపోయినది. అమృతభాండము పగిలిపోయినది' అని బిగ్గఱగఁ బలికెను.

అంత రాణి తెలివిని గోల్పోవక సమయోచితమై యా యర్ధరాత్రముననే వాఘోజీసోదరుల నటకు రప్పించెను.

వారు కారణమెఱుఁగక వడివడి పరుగిడివచ్చిరి. రాణి బోరున నేడ్చుచు లేఖను నొసంగి లాలాశాయి కళేబరమును చూపెను. వారు కర్కశ హృదయు లయ్యు మొదలు నఱికిన కదళీద్వయమువలె గుప్పునఁ గూలిపోయిరి. నవాబు వారి చెంతకుఁబోయి 'అయ్యలార! నన్ను క్షమింపుఁడు. ఈమె మరణమూలమున మనకు మఱియు నెయ్యము దృఢ పడినది. యథాప్రకారము రాజ్యభారమును వహించి నాకు సాయముగా నుండుఁడు' అని పలికెను.

దుఃఖాక్రాంతులై యున్న సోదరులకీ వాక్యములు వినఁబడలేదు. తమ తుచ్ఛభోగలాలసతయే సోదరీ ప్రాణత్యాగ కారణమయ్యెనని వారు వాపోవసాగిరి. అంత రాజనీతిజ్ఞురాలగు రాణి యిట్లనెను: 'అన్నలారా! దుఃఖించి మరల యీ దేవతాంగనను తేలేము. ఈ మహత్తర పాపకార్యము జరుగుటకుఁ బ్రథమకారణము నేనుగా నేర్పడియున్నాను. ప్రాణమునకుఁ బ్రాణము గావలసివచ్చుచో నా యుసురులనే గైకొనుఁడు' అని గంభీరముగ మృదువుగఁ బలికెను. ఈ మాటలతో సోదరుల మనస్సులు తేఱికొనెను. అహమ్మదుషా యేమియుఁ బలుకలేక పోయెను. రాణి మరల 'మీకు నిజముగా నా ప్రాణములు గావలసినచో గైకొనుడు! నే నడ్డుపెట్టను. బీగమునైనను నేను గూడ మాన వాంగననే!' అనెను. అంత వాఘోజీ సోదరులు చేతులు జోడించి 'అమ్మా! చెల్లెలు పోయినది. అక్కవు నీవు మమ్ము లాలించి పాలించి కాపాడుటకు నాశీర్వదించుటకుఁ

గావలెను. మీరు లేనిచో మాకంతయు నంధకారమే' అనెను.

అంత రాణి యిట్లనెను: 'అట్లయినచోఁ జనిపోయిన యీ సోదరికి మరణించిన మహారాజ్ఞికి జరుగవలసిన సకల గౌరవములతో నంత్యక్రియలు జరుగనిండు. ఈ పవిత్ర కళేబరము హిందువులచే తాఁకఁబడి హిందూమతధర్మ ప్రకారము తుదిసంస్కారములు మీ చేతులమీఁదుగా చేయఁబడనిండు. ఈమె పేరున నీమె శల్యముల నొక సువర్ణపేటిక నుంచి యొక మహత్తర సమాధినిగట్టి యందుపై నీమె త్యాగమును గూర్చి సువర్ణాక్షరములతో లిఖించి భక్తితో మనమందఱము పూజింతము' అనెను. నవాబు నట్లే అనెను. సోదరులు పరమానందముతో సోదరికి తుదిసేవను చేయ సిద్ధపడిరి. నవాబు వేఱొక మందిరమున నిద్రించుటకు వెడలెను.

జహనారాబీగమప్పటికిఁ దగినయేర్పాటులు గావించి యంతఃపురమున దనగదికిఁ బోవుచుండెను. అట్లుపోవుచు నొకగదియందంతటి యర్ధరాత్రమున మాటలసవ్వడి యగుటచే నిలిచెను. ఆ మాటలనుమానాస్పదముగ వినవచ్చుటచే 'నేమైయుండ వచ్చునా' అని యచ్చటికిబోయి నిలిచెను.

ఆ స్థలమున వినవచ్చిన యీ క్రింది సంభాషణ మీమె నాశ్చర్యసంభృతగాఁ బొనరించెను.



# పందొమ్మిదవ ప్రకరణము

## (సరళ యెవ్వరు)

జహానారాబీగము ద్వారమున కీవలనుండియే సర్వమును నేకాగ్రచిత్తయై జాగరూకతతో వినుచుండెను. ఒక పురుషకంఠమును, స్త్రీకంఠమును వినవచ్చుచుండెను. ఆ స్త్రీ స్వరము తనకుఁ బరిచితమైయుండుటచేతను, పురుషుఁ డంతఃపురమున కర్ధరాత్రమున రాగలుగుటచేతను, నాశ్చర్యావమానానుమాన కోపములకు లోనయ్యెను. అయినను ధీరోదాత్తగావున నేమియో విందమని మునికాళ్లలో నిలుచుండి నిశ్శబ్దముగా వినుచుండెను.

పురుష॥ దైవకృప నిరుపమానమగుటచే నిన్ను నేఁటికి దెలిసికొనఁ గలిగితిని. నీ చరితమును దెలుపుము.

స్త్రీ॥ నాథా! చెప్పుటకేమున్నది?

జహానారాయాగ్రహము పట్టరానిదయ్యెను. అయినను శాంత గభీరగావున మిన్నక వినుచుండెను.

మరల నబలాకంఠము విననయ్యెను.

'స్వామీ! పూర్వజన్మ సుకృతలేశము శేషించియుండుటచే నా ప్రాణము మీకై వేచి నిలిచియున్నది. నేను పడిన కడగండ్లన్నియిన్ని యనరాదు. నాఁటి భయంకర యుద్ధము నామనస్సున నిప్పటికిని దర్పణమువలె ప్రతిఫలించుచునే యున్నది. ఆనాఁటికీ జహానారా యాఱేండ్ల బాలిక. దాని

నపుడు లాలించు నీ పుత్త్రీవతి నగుటచే వాత్సల్యము గోయ రానిదయ్యెను'

జహానారా స్తంభించిపోయెను. ఈమె యెవరినిగూర్చి మాట్లాడుచున్నది అని యనుకొనెను. ఇంతలో స్త్రీ మరల పలికెను.

'జహానారాబీగము మన ప్రతిమాదేవియే, నాయక్క పుత్త్రియేగదా!'

ఈ వాక్యముతో జహానారా హృదయము గదలి పోయెను. ఆమెకు సర్వవిషయములు మంచు విడివడినట్లు విడివడుచుండెను. సూర్యకిరణములచే నంధకారమువలె సంశయతిమిరము దూరమగుచుండెను. మహత్తరానందము గలుగుచుండెను.

పు॥ అట్లా! అట్లా! అందులకే నాబిడ్డకు నటువంటి దుర్లభోదాత్తగుణము శోభిల్లుచున్నది. ప్రేయసీ! ఎంత సుదినము! ఎంత సుదినము! ఎన్నాళ్లకుఁ దెలిసికొంటిని!

స్త్రీ॥ అహమ్మదుషా జగత్సింగు నన్యాయముగా యుద్ధరంగమునఁ దన కఱకు ఉడిదమునకు బలియిచ్చి యాతని రక్తముచేఁ బ్లావితమైనట్టి యాతని సర్వసంపదలు గొనెను. ఆసంపదలతోఁ గాటీ ప్రతిమనెత్తికొనిపోయి పెంచిరి. ఇది జరిగి నేఁటికిఁ బదునైదేండ్లయినది. ఈమె పదునైదేండ్లయీడున నుండునపుడే

"అహమ్మదుషా" వివాహమాడెను. ఇంక నాస్థితి వినుము.

ఆ యుద్ధముజరిగిన వెనుక మీరుగానరాలేదు. మీకై వెదకితిని. పలవించితిని. అమ్మో బాదుకొని హాయని యాక్రోశించితిని. ప్రతిస్థలము వెదకి వేసరి నేనెంత యలమటించితినో, మీ చరణారవింద దర్శనభాగ్యము దుర్లభమైనందులకు నేనెంత యారాటపడితినో ప్రభూ! ఆ పరాత్పరునకే తెలియును. ముఖ ప్రక్షాళనముగాని, స్నాన ధర్మముగాని, సక్రమ భోజనముగాని నే నెఱుంగను. ఉన్మాదినై పోవుదు ననుకొంటిని. కాని నాహృదయము వజ్రనిర్మితము. ఇది పగులలేదు. తుదకెట్లో దుఃఖ ముపశమింపఁజేసికొని యీ యవనుల యంతఃపురమును బ్రవేశించితిని. మన ప్రతిమపై గల వాత్సల్యమే యిందులకుఁగారణము. దాని ముఖమైనఁ గనఁబడుచుండుటచేతనే యింతవఱకుజీవించియున్నాను. ఆమెకు నే దాసినై ప్రచ్ఛన్న వేషమున నున్నాను. నన్నామె గుర్తింపలేదు. నేను రాజపుత్రస్త్రీనె గాక గౌరవనీయురాలనని తెలిసికొని నాబిడ్డచందమున నే వర్తించుచుండును. మిమ్ములను జూచు శుభసమయము వచ్చునేమోయని యాశించికొని మీదర్శనానంతర మసువులువీడ సంకల్పించితిని. ఆశాజీవినై బ్రతుకుచున్నాను. అట్టియెడ దైవము మిమ్ము నా బహుజనసంచిత పుణ్యమువలనఁ జూపించెను. ఆనాఁడు మీరు సిద్దీసమాధికడ జహనారాబీగమును బంధింపవచ్చిన సమయమున దొలుతటిసారిగా మిమ్ము చూచితిని. ఆశ్చర్య

సంభ్రమ చకితనైతిని. కాని మీబలవంతసింగు నామము నన్ను కలవరపెట్టినది. సార్థకనామమైన ప్రతాపసింహా హ్వాయము దాల్చిన నాభర్త యిట్టి మాఱుపేరు ధరింపవలసి వచ్చినదేయని మిక్కిలి ఖేదించితిని. మీనుదుటఁగల యదృష్టసూచకములగు నంగమచ్ఛములఁగాంచి మిమ్ములను నా హృదయాధినాథునిగాఁ బ్రాణేశ్వరునిగాఁ దుది నిర్ణయము చేసికొంటిని. నాటితోఁ దీఱిపోయినదనుకొనిన మన యీ యైహికసంబంధము పూర్తిగా విడివడలేదనియు నెఱిఁగితిని. నామహత్తర పుణ్యరాశి నీరూపమునఁ గాన్పించినదని తెలిసికొంటిని. అనేక కష్టముల ననుభవించితిమి. ప్రణయరాజ్య ద్వారమును చేరకమున్నే యుద్ధము మనకోరికలను ద్రెంచి వైచినది. నేఁడట్టి యాలోచనల కుత్సాహములేదు. ఆ ప్రదేశమున విజ్ఞానశిఖలు చింతాధూమపూర్వములై యుదయించుచున్నవి. నాపాలింటిదైవము సర్వస్వమునగు నిన్ను నాకు మరల భగవంతుఁడిచ్చినాఁడు. నాకింతియచాలును. ఈ యవనాంతఃపురప్రవేశ కారణము మీకు తెలియకపోవుటయు, జహానారాయందలి నా మమకారము గారణముగా నేర్పడినవేగాని వేఱుగాదని నీపాదముల యానగాఁ బలుకుచున్నాను.' అని పలికి నిశ్శబ్దముగా నేడ్చుచుఁ బురుషుని పాదములపైఁ బడెను.

ఆతఁడు ప్రేమపూర్వకముగా నామెను గ్రుచ్చియెత్తి 'సాధ్వీ! దుఃఖింపకుము. ప్రతాపసింహుని ధర్మపత్ని సరళాదేవి ధర్మచ్యుతగాదని నాకుఁ దెలియును. నాకెట్టి యను

మానము లేదు. నీవు నాకుఁ గాన్పించితివి. నావంటియదృష్ట వంతుఁ డిక లేఁడు. నేనెప్పటికిని నిన్నుఁ బ్రేమించు ప్రతాప సింహుఁడనే.' అనెను.

ఇట్లు పలికి బలవంతసింహ నామధేయుఁడగు ప్రతాప సింహుఁడు మరల వచించెను.

'ప్రేయసీ! నాఁడు నేను యుద్ధరంగమున గొప్పగాయ ములచే సొమ్మసిలి పడిపోతిని. కన్నులుదెఱచి చూచునప్పటికి నేను సుప్రసిద్ధ వీరుఁడగు సంస్థానసింగుయొక్క యాదర ణలో నుంటినని తెలిసికొంటిని. ఆ బియోలాసంస్థాన ప్రభువు నన్ను భ్రాతృప్రేమతో నాదరించి తగు నధికారమిచ్చి నాకు బ్రేమంపు టన్నయయ్యెను. నేనాతని తమ్ముఁడనైతిని. ఇంత కంటెను నాజీవితమున విశేషము లెవ్వియు లేవు. పదునై దేండ్లు నిన్నుఁగూర్చి నేను పలుతెఱఁగుల వెదకించితిని. వేయివిధముల సహస్రదేవతలకు మ్రొక్కికొంటిని. లాభము లేకపోయినది. నిన్నాదినమున జహానారాబీగము - కాదు మనపుత్త్రియగు ప్రతిమ సన్నిధానమునఁ జూచితిని. అయి నను నిన్ను నేను పోల్చికొనలేదు. యవనాంతఃపురదాసిని నిన్నుఁగానెట్లు గుర్తింతును? మనమెడఁబాయునప్పటికి నీ కిరువదియేండ్లు గూడ నిండుటలేదు. ఇప్పుడు పదునై దేండ్లు గడచిన వెనుకఁ జూచుటచే నీయందు శారీరకముగఁగలిగిన గొప్ప మార్పులచేతను బోల్చికొనలేకపోయితిని. అంతియ గాదు. మహారాజ్ఞియగు నాగర్భశ్రీమంతురా లిట్టి నీచదాసీ వేషమున నుండునని నేనెట్లు విశ్వసింతును? ఈకారణములచే

నిన్నుఁ బోల్చికొనలేదు. అయినను నీరూపము నామదికి హత్తికొని మెచ్చుటనో చూచిన ముఖమువలె గోచరించు చుండెను. ఆ నాఁడీవయస్సులో నీ మాతృదేవతారూపము నిట్టులనేయుండెను. కారణములేకయే నీయందొక ప్రేమ గౌరవభావము నాకుఁ గలిగెనుగాని యిదమిత్థమని నిర్ణయింపలేకపోయితిని. నేఁటి కీ బలవత్తర ఋణానుబంధ మెట్టిదో, యెంతపవిత్రమైనదో వెల్లడియైనది. నాకు లేఖ తెచ్చిన రాయబారి నాతో నేమియు విశేషము చెప్పలేదు. నీవును లేఖలో నేవిషయమును వ్రాయక 'సరళ మీయర్ధాంగియే' అనిమాత్రము వ్రాసి యందొక రాజాంతఃపుర ప్రవేశాధికారము నిచ్చు ముద్రికనుంచితివి. ఇది రాజకీయపు గుట్టయో, నా కపాయముసకై నవాబు పన్నిన పన్నుగడయో యనియు, రాజాంతఃపుర ముత్తమక్షత్రియుఁ డర్ధరాత్రమునఁ బ్రవేశింపఁదగునాయనియు, నిర్మలాంతఃకరణముతోఁ బ్రవేశించు నాకుఁ గష్టములు ప్రాప్తించినచోఁ గత్తియే కాపాడుననియు నిశ్చయించుకొంటిని. నేఁడు నవాబుతో లాలా భాయి సమాగమదినోత్సవముగావున నిదియే యదనని వచ్చితిని. నిన్నుఁ జూడఁగలిగితిని. ఇంక వీరభటుల చుఱుకుఁగత్తులు నన్ను త్తరించినను చింత లేదు. ప్రేయసీ! నేను ధన్యుఁడను. మన పవిత్రప్రణయమునకు ఫలితముగా నిన్ను దర్శింపఁగంటిని. భాషింపనోచితిని. ఇంతకంటె నాకుఁ గావలసినదేమున్నది? ఈ యానందము పట్టఁజాలను.'

అని యాతఁడామెను దుఃఖహర్షావేగముతో నున్మాది వలెఁ బరిష్వంగ మొనర్చికొనెను.

రాజ్ఞీమణియానందమునకు మేర లేదు. ఆమె కీవిషయములు కథవలెనుండెను. ఎదుటనున్న పవిత్రమూర్తులిరువురుఁ బినతండ్రియుఁ బినతల్లియునని తెలియుటచే నాకస్మికానందముచే నామెయున్మత్తయై స్తంభించిపోయెను. వెంటనే పిచ్చిదానివలె లోనికిఁ బరువిడి వారి పాదసాన్నిధ్యమునవ్రాలి "నిర్భాగ్యనగు మీపుత్త్రిని' అనెను. ఆనందముచే వేఱొక ప్రపంచమున నున్నవారివలెఁ బరస్పర సంశ్లేషమున నున్న చిరవియోగదంపతులకు స్మృతిగలిగి వెంటనే యామెను లేవనెత్తి 'బిడ్డా!' అని యూరార్చి 'భగవంతుఁడు మన పాలఁగలఁడు' అని పలికిరి. కతిపయ నిమిషములు నిశ్శబ్దముగఁ గడచెను.

జహనారా వారికి లాలాబాయి దుఃఖకరమగు మరణమును గూర్చి తెలిపెను. సరళా బలవంతసింగుల దుఃఖమింతింత యనరాదు. బలవంతసింగు తన పరాక్రమమును నిందించుకొనెను. తాను లాలాబాయిని గాపాడఁజాలక పోయినది మహాపాపమని నొచ్చికొనెను.

అనంతర మొకగంటకాలము సంతోషపూర్వకముగ నిష్టములైన విషయములనుగూర్చి మాట్లాడుకొనిరి.

అప్పటికి రాత్రి సుమారు రెండు గంటలయినది. ప్రకృతి నిశ్శబ్దమై నిస్తరంగ నీరధి ననుకరించి యుండెను. గుడ్డివెన్నెల వెలుఁగుమాత్రము గానవచ్చుచుండెను. అంతే

వివేకియు సమర్థయు నగు జహానారాబీగ మిట్లుపలికెను:
'అమ్మా! పిన్నీ! నేనొక విన్నప మాచరించుచున్నాను.'

సరళ॥ బిడ్డా! ప్రతిమా!

జహా॥ పిన్నీ! మనము దుఃఖనిమగ్నులమైయుండు సమయమున భగవంతుఁ డానందమును గూర్చినాఁడు. దీనియందు తబ్బిబ్బుపడి కార్యము చెడిపికొనరాదు. కావున నీవును బాబయ్యయుఁ గలిసి యిపుడే సురక్షితముగా నన్యులెఱుంగని రీతి పోవలసినదిగాఁ బ్రార్థించుచున్నాను. నేనెట్లును బతితనైతిని. ఇంక నిప్పుడు మీరు సురక్షితముగ వెడలుఁడు. పాపి దైవము మీతో నొకదినమైన సుఖముగాఁ గడుపు భద్రావకాశమీయలేదు.

అనుచుఁ గన్నుల నీరిడెను.

సర॥ బిడ్డా! నిన్ను విడిచి నేను మనఁజాలను. కఠిన హృదయవు గాకుము.

జహా॥ అమ్మా! అట్లుగాదు. నేఁడు నీస్వామి వచ్చినాఁడు. చిరకాల వియోగసంతప్తుఁడగు నాతనికిఁ దగిన సేవ చేయుట ధర్మమని చెప్పుటకు నేనెంతదానను? ఆలస్యమైనచో రాజపురుషులమూలమున రహస్యము బట్టబయలై మనమెల్ల నపాయములోఁ బడిపోవుదుము. అప్పుడు నేను నాతండ్రిని రక్షించికొనఁజాలను. తండ్రీ! నీవు నీకుమార్తె వాక్యములను బాటింపుము. ఇప్పుడు జేలతనము వలదు. నిమిష నిమిషము నపాయమే! అపాయమునఁ జిక్కిన వెనుక

నేఁడు మనకిట నుపాయము నాస్తి. అని పలుకుచు నిరువురి పాదముల నంటెను.

సరళా ప్రతాపులు ప్రతిమాదేవి వాక్యములయందలి దూరదృష్టిని గమనించి తుదకెట్లో సమ్మతించిరి. అంత సరళ మరల నిట్లనెను: 'బిడ్డా! నీవు ప్రణయ దేవత నర్థము చేసికొనఁజాలని కాముకుఁడగు మూఢుని యగార మునఁ బడియున్నదానవు. నీ మంచి చెడ్డలను నేను పోయిన వెనుక విచారించువారు లేరుగదా! హృదయ మపాయమును శంకించుచున్నది' అనెను. అందులకుఁ బ్రతిమ యిట్లనెను: 'అమ్మా! నవాబట్టివాఁడేయగునుగాక! కాని నాగీచినగీటు దాఁటువాఁడు కాఁడు. ప్రేమ యపాయమునే శంకించునుగావున నట్లు పలుకుచున్నావు' అనెను. అందులకు సరళ మాఱుపలుకలేక యామెను బిగ్గ కవుంగిలించి కొని యేడ్చెను. బలవంతసింగు హృదయము కరఁగి యుదార పురుషుఁడుగావున నిట్లనెను. 'బిడ్డా! నీవు వివేకవి, సమర్థవు అను నమ్మకముతో మేము నిన్ను విడిచిపోవుటకు సమ్మతించు చున్నాము. లోకకల్యాణార్థమే నీ జీవితముసుమా' అనెను. ప్రతిమ యానందముతో 'బాబా! నీ యాశీస్సు నిజమగుఁ గాక! లోకకల్యాణమున కీజీవితము నిరుపయోగమగువాఁడు వ్యర్థముగా జీవించుదానను కాను' అనెను. సరళ 'బిడ్డా! ఎందుల కట్టిమాటలు?' అని దుఃఖార్తయై పలికెను.

అనంతరము ప్రతిమాదేవి తగు సన్నాహము లేర్ప ఱచి రహస్యముగా వేఁకువజాముననే సరళాప్రతాపులను గోటదాఁటించెను.

# ఇరువదియవ ప్రకరణము

## (దుష్టాలోచన)

వాఘో॥ అపుడు మేము మిద్దె పైభాగమునుండి గవాక్ష మార్గమునఁ జూచుచుంటిమి. అప్పటికి లాలా మరణించి నెలయైనది.

అహ॥ అప్పుడు?

వాఘో॥ ప్రభూ! కడముట్ట వినుఁడు. సంస్థానసింగు శ్వేతాశ్వము నొకదానినెక్కి యాత్రోవను బోవుచుండెను. అట్టి యుత్తమహయము మనలాయములలోఁగూడ లేదు. అప్పుడే పండ్రెండుగంటలు దివాణమునఁ గొట్టినది. సూర్యుఁడు దుర్నిరీక్ష్యుఁడై గగనమధ్యభాగమున నిలిచియుండెను. మఱియు మండుటెండలకాలము. ఇఁకఁ జెప్పవలయునా! ఆతని ముఖమును గప్పికొనుట కొక యాతపత్రమైన లేకుండెను. చెమ్మట ముమ్మరముగాఁ గారుచుండెను.

అహ॥ కేవలము లుబ్ధుఁడు, మూర్ఖుఁడుగాఁ గనఁబడుచున్నాఁడు.

వాఘో॥ నిజము. సరిగా వక్కాణించితిరి. మొఱటు కొండలలోఁబుట్టి యాతిప్పలలోనే పెరిగిన బోయవంటివాఁడు. తలపై మాత్ర మొక స్వదేశీయవస్త్రమును ఛత్త్రమునకు బదులుగా గప్పికొనినాఁడు. గుఱ్ఱము

చండమార్తాండ కిరణధాటికి దీర్ఘప్రయాణమునకు నాఁగలేక బడలి మెల్లమెల్లఁగా నడచుచుండెను. వాఁడుమాత్రమలసినట్లు గాన్పింపఁడు. అప్పుడు నేను భరింపలేక ఛలోక్తిగా సోదరునితో నిట్లంటిని: 'ఎవఁడా మహానుభావుఁడు? ముఖముపై గుడ్డ కప్పుకొని దాడుతీయుచున్నాఁడు!'

అహ॥ సెబాసు. నాకు నచ్చినమాటయంటివి. వానిగర్వము చచ్చి కుప్పతిప్పలుగఁ గూలియుండును.

వాఘో॥ అట్లు కాలేదు ప్రభూ! అట్లయిన నింకేమి? అశ్వమును నిలిపి, సౌధవాతాయనముగుండ గఠినేక్షణముల నా యనుజుని నన్ను విలోకించి పలుకరాని దుర్భాషలాడెను. అవి నేను వచింపలేను. మీగౌరవమునకు వంశమునకుఁ గళంకమాపాదించుపలుకులు గూడ పొగరుబోతై పలికెను.

అహమ్మదుషా॥ ఆ! ఏమనెను?

వాఘో॥ మండిపడి వాఁడిట్లనియెను. 'నేనేల ముఖముపై గుడ్డ కప్పుకొని దానిని దాఁచికొని దాడు తీయవలెను? కామాంధులకుఁ ద్రాగుబోతులకుఁ బవిత్రయగు సోదరిని దార్చి భోగము లనుభవించు రాజపుత్రి కులపాంసనులు, క్షుద్రకీటములు ముఖముపై గుడ్డకప్పికొని దాఁడు తీయవలెను. చని పోయిన చెల్లెలికన్న బుద్ధిలో వేయిపాలు లేనివారు పురుషులైన నపుంసకులుగదా! ఆనవాబునకు మీరు,

మీా కా కామాంధుఁడు సరిపోయినారు!' ఇట్లు పలికి వికటముగా నవ్వి మీాసలుదువ్వి తలపంకించి నిలు వక తీవ్వన గుజ్జమును బరుగెత్తించెను. వాఁడు పలికిన ప్రత్యక్షరమొక విషదిగ్ధశరమువలె తీవ్ర వేదనాకరమగుచున్నది. నేఁటికి నాలుగుదినములైనది. ఇంతవఱకు మాకీ మహత్తరావమానముచే నిదుర సరిగాలేదు. భోజనము సక్రమముగ రుచింప లేదు. మమ్ములను దూషించుటయేగాక మా ప్రభువును, ప్రాణబంధువు నగు మిమ్ముగూడ ననరాని దుర్భాషల నాడినవానినిఁ దలఁచినచో నాకు దుర్భరముగా నున్నది.

అహమ్మదుషా సంస్థానసింగుప్రవర్తనమును దలఁచి రోషభీషణాకారుఁడై 'ఆ! ఎంతమాట పలికినాఁడు. నవాబు స్త్రీలోలుఁడు, మద్యపాన రతుఁడునా! వీనిని పట్టించి వధించి కుక్కలకుఁ దత్పిశితఖండములు వేయించెదను. అప్పటికిఁగాని నా క్రోధానల ముపశమింపదు' అని యారక్తనయనుఁడు, ప్రకంపమానశరీరుఁడునై పలికెను. ఆతని వాక్కులకు మందిరమెల్ల ప్రతిధ్వనించి యల్లాడిపోయెను.

అంత జితోజీ యిట్లనెను: 'నవాబుగారు దీర్ఘాలోచన చేసి చెప్పుటలేదని వచించుటకు జంకుచున్నాను.'

అహ॥ ఎట్లు?

జితోజీ॥ రాజపుత్రులకు మానము ప్రథమము. ప్రాణము ద్వితీయము. ప్రాణము సులభముగా నీయఁగలరు. మాన

మునకుఁజాలరు. మీరు సంస్థానసింగునకు విధింప నున్న శిక్ష శిక్షగాదు. అయ్యది మన కోపశమన మునుగాని మానగౌరవమునుగాని చేయఁగల శక్తి గలదిగాదు.

అహ॥ మిత్రమా! నిక్కము వచించితివి. ఏమిచేయవలెనో సెలవిమ్ము.

వాధో॥ ప్రభూ! నేను సెలవిచ్చుటయేమి? విన్నవించెదను. మాసోదరిని రాజాంతఃపురమును జేర్చితిమని వెక్కిరించి విషమోల్లాసనముల నాడినాఁడు. స్త్రీలోలునిగా మిమ్ము దూషించినాడు. ఇవి కానరానివియు, ఆఱనివియు, దుర్భరములు నగు గాయములు. అవధరింపుఁడు. వానికి జగదేక సౌందర్యమూర్తి పదునెనిమిదేండ్ల పుత్త్రికగలదు. అయ్యది మీకర్థాంగి కాదగిన కన్యామణి. అట్టిజగదేకమోహన సౌందర్యవతి జగతిలోలేదని పందెమువేసి ఘంటాపథముగఁ జెప్పఁగలము. కావున మీరా బాలికను వివాహమాడినచో నేఁటి మీ విచారము దీఱిపోవును. మనము తగిన ప్రాయశ్చిత్తము రాజపుత్త్రోధమునకుఁ జేసినట్లగును.

నవాబు సంతోషమునకు మేఱలేకపోయెను. అతఁడు ప్రపంచమునే మఱచిపోయెను. అందులకుఁ దగిన యత్నము లప్పుడే గావింపనున్నానని పల్కెను.

కుటిలురగు వాధోజీ జితోజీలు మిక్కిలి హర్షహృదయులైరని వేఱుగఁ జెప్పవలయునా?

# ఇరువది యొకటవ ప్రకరణము

## (సంస్థానసింగు సభ)

నవాబు సహజముగాఁ గామాంధుఁడు. నేఁడు వక్ర చిత్తులగు వాథోజీజితోజీల హస్తములలో నిఱికికొనినాఁడు. అదిగాక యెంతయో విశ్వప్రయత్నముపై సాధించిన లాలా భాయి తనకుఁ గానిదై నశించిపోయెను. నేఁ డీతని కయ్యది పెద్దలోపముగా గన్పట్టుచున్నది. అట్టి స్థితిలో సంస్థానసింగు పై కొండెములు వినెను. జగదేకమోహనాంగియగు బాలిక యాతనితనూభవయని తెలిసికొనెను. ఇంక నాతఁడేల తన పట్టువిడును? మూర్ఖుఁడు నవివేకియగువాఁడు తన యనుభవములచేతఁగాని, మహత్తరవ్యక్తుల బోధనలచేతఁగాని, విజ్ఞానోదయమున వికసింపఁడుగదా? సంస్థానసింగునకు శృంగభంగ మొనర్చుట, తన యంతఃపురమున కొక శృంగారవతి చేరుట, యొక కార్యములోనే జరుగుచున్నదని తలఁచెను. విలంబనములేక, తుదకు జహనారాబీగముయొక్క సలహానుగూడఁ గైకొనక, రాయబారుల నంపెను. తెలిసినచో జహనారాబీగ మీ కార్యములకు భంగమాపాదించునేమోయని భయపడెను. క్రమముగాఁ జెప్పవచ్చును అని భావించెను. స్త్రీలోలుఁడు, దుష్టుఁడునయ్యు, జహనారా బీగము నెడ నింతమాత్రము మర్యాదగా నుండుటయే యాతనికడఁ గల సుగుణము. ఇందులకుఁ గారణము జహనారా సామర్థ్యమును దన్మూలమునఁ దనకు శ్రమలేకయే రాజ్యా

కార్యములు జరిగిపోవుచుండుటయుఁ గూడ నై యుండ వచ్చును. కావున స్వార్థుఁడై యిట్టి గౌరవము నిచ్చెననియే చెప్పవచ్చును.

మూర్ఖుఁడు, చలపాది, హృదయశూన్యుఁడు నైన నవాబు రాయబారము సంస్థానసింగు సంస్థానమును చేరెను. నాఁడు వాథోజీసంస్థానమున లాలాబాయి విషయమై యెట్టి యలజడి జరిగెనో యట్టి యలజడియే నేఁడిచ్చట గలిగెనని సంగ్రహించి వ్రాయుటయే యుత్తమము. కాని సంస్థానసింగు గాని ప్రతాపసింగుగాని సరళగాని ధనప్రియులు గారని మన మెఱిఁగినవిషయమే. వీరు పిఱికివారు గూడ గారు. లాలా బాయి మరణము నేఁటివరకుఁ బ్రతాపసింగునకు ఆఱని గాయముగానుండెను. ఉపాయముతో నామెను గాపాడ లేకపోయితినేయని యింకను విచారించుచునే యుండెను. వాథోజీ సోదరులు నీచులనియుఁ, బాములకుఁ బాలుపోసి పెంచినట్లయ్యెననియు నాతఁడు భావించుచుండెను. నేఁటి యీ యకాల ప్రళయమునకు బీజప్రాయులు వారేయని యాతఁడు భావించెను.

'సంస్థానసింగు హిందూమహమ్మదీయ సఖ్యమునకుఁ గోరి పుత్త్రినైన నీయవలెను. కాని నాఁడు యుద్ధమునకేగి సంసిద్ధ పడవలెను' అనియే సందేశముయొక్క సారాంశము.

ఇచ్చట నెట్టి చర్చలు జరుగలేదు. రాయబారము ననుసరించి వివాహము చేయఁదలఁచుట గాని, యుద్ధము చేయుటగాని దేనినో యొకదాని నిప్పుడు నిర్ణయింపవలెను.

దూరబుద్ధి గల యా రాజపుత్త్రులు క్రియాసిద్ధి కొఱకుగా సమయోచిత మెఱింగి చర్చలకుం దావీయలేదు. అహమ్మదుషా స్వభావమును దెలిసినవారగుటచే నతనికోరిక విపరీతమని వారు మండిపడలేదు. నిర్ణయము నిరువదినాలుగు గంటలలో తెలియఁ జేయుచున్నామని మాత్రము పలికి రాయబారికిఁ దగిన మర్యాదలుచేసి పంపి వేసిరి. రాయబారి వెడలిన యనంతరము సంస్థానసింగు ప్రతాపసింగు లేకాంతమున నిట్లు మాట్లాడిరి:

ప్రతా॥ అన్నా! కార్యవిధానమేమి?

సంస్థా॥ నీ విధానమే నా విధానము. మోసగానిని మోసము చేతనే జయింపవలెను. కుక్క కాటునకు చెప్పుదెబ్బ.

ప్రతా॥ నాయుద్దేశము నదియే. కావున వివాహమునకు సమ్మతించినట్లు సమ్మతింపవలెను. యుద్ధము నాసమ్మతము గాదు. మనము నొచ్చినను మన ప్రతిమహృదయము పగిలిపోవును. కావున యుక్తిచే కార్యము సానుకూలము చేసికొనవలెను.

సం॥ తమ్ముఁడా! మేలు! మేలు!

ప్రతా॥ అన్నా! కట్టె విఱుఁగకుండఁ బాము చావకుండ కార్యము సాధింపవలెను. యుద్ధముమాట యనవసరము. వివాహమునకు హైందవ పద్ధతితో దరలి వచ్చినచో సమ్మతమని టక్కుటకటాంకు వాక్యములు పలికి మాసము దినములు వ్యవధియుండునట్లుగా నొక ముహూర్తము నిర్ణయించి, యా

లోపున మన ముద్దులపట్టియగు తేజోవతిని యిడాల్ సంస్థానాధిపతి మాధవరాయలకు రహస్యముగ నిచ్చి వివాహము చేయవలెను. అనంతరము సేనలను రహస్యముగఁ గూర్చికొని బియోలా మైదానమున బెండ్లి మిషతో నవాబును సంధింపవలెను.

సం॥ మంచిది. అయినను మనము సూచించిన పద్ధతిలో నెట్టి సందేహమైన నవాబు పెట్టికొనినచో కార్యము చెడును గదా!

ప్రతా॥ సోదరా! మనప్రతిమ యప్రతిమాన ధీప్రతిభగలది యచ్చట గలదుగదా! ఆమెకొక రహస్యలేఖ చేరవలెను.

సం॥ అవును, బాగుగ వచించితివి.

ప్రతా॥ అన్నా! మరియొక ముఖ్యమగు విషయము గలదు.

సం॥ తమ్ముఁడా! అదియేమి?

ప్రతా॥ వాథోజీ సోదరులు భోగలాలసులై కులమర్యాదలు గలవారికి నవాబుమూలముగా అవమానము, నాశనము గల్పించుచున్నారు. నీచే నుల్లసమాడఁబడి, నవాబునకు బోధించి నేడీ ప్రళయమును దెచ్చిపెట్టినట్లున్నది. ఈ పాపాత్ములకు భగవంతుఁడే నూతన నరకము సృష్టింప నున్నాఁడో! బియోలా మైదానమున వీరిని డొలుదొ త్త నంతకసన్నిధానమునకు నేనై పంపుటకు నీ పాదముల యానగా ప్రతిజ్ఞఁజేయుచున్నాను. అందువలన నిఁకనైన క్షత్రియ కుటుంబ

ములు బ్రతుకును. ఈ సోదరుల వధము పుణ్యకార్యమే గాని పాపకార్యము గాదు.

సం॥ మేలు! మేలు! సోదరా! నీవీకార్యము నీ యిష్టానుసారము చేయవచ్చును. దైవకృపవలన నెఱవేఱును గాక!

ప్రతా॥ సంతోషము.

ఇట్లు వారు సంగ్రహముగా సంభాషించుకొని, సరశతో నాలోచించుకొని యామె సమ్మతిఁగూడఁ గైకొనిరి. అనంతర మీ క్రిందివిధముగా నొక లేఖను వ్రాసి తగిన రాయబారిద్వారా అహమ్మదుషాకుఁ బంపిరి:

"ముసల్మాను చక్రవర్తి అహమ్మదుషా నవాబునకు అల్లా సర్వవిధముల మేలుచేయును గాక! మీయొక్క క్షేమములును నాకు కృతిక. పుత్త్రికయగు జహనారాబీగము క్షేమములు వినినందులకు మిగుల సంతసించుచు భగవంతునిఁగూర్చి నమస్కృతు లొనరించుచున్నాను.

మీకును మాకును సంబంధములు క్రొత్తవిగావు. అందులకుఁ బ్రత్యక్ష నిదర్శనము నేఁటి జహనారాబీగముగా నున్న మా ప్రతిమాదేవియే. ఇట్టియెడ మా యందు మీరు వేఱుభావము వహించుటకుఁ గారణము దురూహముగా నున్నది.

మీ యద్వితీయమైన పాలనములో మీ క్షేమమును సౌఖ్యమును గాంక్షించు మేము యుద్ధములు చేయువారము గాము. రక్తబంధువులతో యుద్ధము చేయునంతటి వెఱ్ఱి మాకుఁ బట్టలేదు.

మా పుత్త్రికను మీకు వివాహమునఁ గూర్చుట యత్యంతానందకర విషయము. ఈ విషయమై మేమే ప్రస్తావింపఁ దలఁచియుఁ బ్రతిమాదేవికి సవతి నొకర్తెఁ గల్పింప నిష్టములేక యిన్నాళ్లు విలంబనము చేసితిమి. అంతేగాని వేఱుగాదు.

సిరి రా మోకాలొడ్డువా రుండరు. ప్రభువులరగు మీరే మీ యంతఁ గోరునప్పుడు మేము సమ్మతింపక యెట్లుండఁగలము? అంతియగాదు. మా యుద్దేశము, మీ కోరిక యొకటియగుట దైవఘటనమే యని తోఁచుచున్నది.

అయినను మాకొక కోరికగలదు. ప్రతిమాదేవి వివాహము మా సమక్షమున జరుగలేదు. ఆ బాలిక బలాత్కృతముగాఁ గొనిపోవఁబడి మహమ్మదీయాంతఃపురములలోఁ బెంపఁబడి మహమ్మదీయాచారముల ప్రకారము వివాహము చేయబడిన దయ్యెను.

నేఁడు మేము సంస్థానముగలిగి మానసంపదలు గలిగి జీవించియున్న తల్లిదండ్రులము. ఈమె మా కాఅవప్రాణమగు నేకైకపుత్త్రిక. కావునఁ దొలుదొల్త జహనారా బీగము లిఖిత రూపకమగు సమ్మతి మాకుఁ బంపవలెను. అనంతరము హైందవాచారముల ననుసరించి వివాహము జరుగవలయును. మా యాచారముల నపహసింపరాదు; తప్పు పట్టరాదు; అనుమానించరాదు; విమర్శింపరాదు. ఇది మా రాజపుత్త్రాచారము. ఆడంబరములేని వివాహము జరిగి

పోవలెను. మీరు వరులై తరలివచ్చునప్పుడు మీగౌర వార్థము వేడుకల్లు జరిపెదము. ఫిరంగులఁ బ్రేల్చెదము. మిమ్ము సకల రాజోపచారములతో నాహ్వానించెదము. కావునఁ గతిపయ పరివారముతో రావలెను. మీ పరివారము మా యాచారములను శంకింపఁ గూడదు. అగౌరవింపఁ గూడదు. ఇది మా ప్రార్థనము.

మఱియొక విన్నపము ఏమన: వివాహానంతరము హైందవ మతాచారముల ననుసరించుచు, హైందవ దేవతల బూజించుచు యావజ్జీవము గడుప నా పుత్త్రిక కధికార మీయవలెను.

ఈ రాయబారి ద్వారా వివాహమునకు సమ్మతించిన విషయమును దెలుపు గౌరవనీయములగు దుస్తులను నాభరణములను గ్రహింపఁ బ్రార్థన.

మనకుఁ జిరకాలమైత్రి యీ వివాహ మూలమున స్థాపితమగును గాక! హిందూ మహమ్మదీయమైత్రి వర్ధిల్లును గాక!

ఇట్లు

బియోాల సంస్థాన ప్రజల సమ్మతిని, సంస్థానసింగు.''

ఇట్లు వ్రాయఁబడిన లేఖను తగిన రాయబారిచేతికిచ్చి పంపిరి. దానితోపాటు రహస్యముగా వేరొక లేఖను వివాహమునకు సమ్మతించినట్టుల వ్రాయవలసినదిగా ప్రతిమాదేవిని ప్రబోధించుచుఁ బోయినది. అది కేవల మభినయమే. అదికూడ యంతరార్థమందే లిఖింపబడినది.



# ఇరువదిరెండవ ప్రకరణము

## (వాసంతీ జహనారాలు)

పైనుదాహరించిన లేఖ 'అహమ్మదుషా'కు మితిలేని యానందము నొడఁగూర్చినదనుటలో నతిశయోక్తిలేదు. తనయదృష్టము పండెననియుఁ దన యధికారము నిరుపమానమనియు ననుకొనుచుండెను. ఇప్పు డాతని హృదయఫలకమునుండి లాలాబాయి సౌందర్యప్రతిమ తుడిచివేయఁబడెను. కాముకుల కంతఃకరణము లేదు గదా! ఆతఁ డెన్నియోరీతుల తన భావిసౌఖ్యమును గూర్చి తలపోసికొనుచు నెన్నియో యాకాశహర్మ్యముల నిర్మించికొనుచుండెను. అయినను కొన్ని సందేహాసిరదము లాతని హృదయాభ్రమున నలముకొనుచుండెను. ఈ వివాహమునకు జహనారాబీగ మొప్పికొనునా? ఒప్పికొన్న దనుకొందము. ఇంత సులభముగా వివాహమగునా? ఇట్టి తలపోఁతలలోఁ బట్టుపాన్పునఁ బవ్వళించియుండి హుక్కాఁ ద్రాగుచుఁ దన యాంతరంగికానుచరులగు వాధోజీసోదరులకై వర్తమాన మంపెను. వారును వచ్చిరి. అందు వారిట్లు సంభాషించిరి:

అహా॥ మిత్రులారా! మనకు సంస్థానసింగు కడనుండి యిట్టి లేఖ వచ్చి వారముదినములైనను మనమెట్టి ప్రత్యుత్తరము పంపలేదు. వారింత సులభముగా లొంగుటకుఁ గారణమేమో తెలియకున్నది.

వాథో॥ ప్రభూ! ఇదియొక పన్నాగము. ఏమన రాణి యిందుల కొప్పికొనదని వారెఱుగుదురు. అందుచే మహారాజ్ఞి గారి యాజ్ఞను వివాహమునకుఁ దీసికొనవలసినదిగాఁ దెల్పిరి.

అహ॥ రాజ్ఞీమణి యాజ్ఞను పడయుటయే కష్టము. మీ సలహా నిందు గోరుచున్నాను.

అంత సోదరులైకకంఠ్యముగా నిట్లనిరి. సంస్థానసింగు దాంభికుఁడేగాక పిఱికివాఁడనియు, ఆ కారణమున రాణి యొప్పికొనఁజాలని యొకయొడంబడిక కనిపెట్టెననియు, నంత కంటె వేఱేమియులేదనియుఁ బలికిరి. రాజ్ఞీమణి యాజ్ఞాపత్ర మెట్లయినఁ బడయవలెనని హెచ్చరించిరి. అంత అహమ్మదుషా వారిని సాగనంపి, తొట్రుపడుచున్న మనస్సులో ప్రక్కనున్న దాసిని జూచి 'ఓసీ! బీగముగారిని మా యాజ్ఞగా రమ్మనుము' అనెను. అది పోఁబోవుచుండఁగా మరల నిలిపి 'వలదు! నేనే స్వయముగాపోయి దేవిగారి దర్శనము చేసికొనెదను. నీవు పోయి 'నవాబుగా రవసర కార్యములఁ జర్చించు నిమిత్తము వచ్చుచున్నా'రని హెచ్చ రింపుము' అని పలికెను. నేఁడు అహమ్మదుషా యీ విషయ మున నలవాటులేనివింతవర్తనమును జూపెను. జహానారా కడకుఁ దొలుత దాసీనిపంపు నాచారములేదు గాని, నేఁడు మనస్సు వివాహవాంఛామూలమునఁ జెడుటచే కార్యా కార్య విచారము దక్కి యిట్లు పొనరించెను. అంత ఆ దాసి త్వరితగతి నంతఃపురమువైపు బరుగిడెను. అప్పుడచ్చట

జహానారాబీగ మొక నూతనాగంతుకతో నీక్రిందిరీతి రహస్య సంభాషణ మొనరించుచుండెను:

జహా॥ వాసంతీ! నిన్నుచూచిన మాపిన్నిని జూచినట్లున్నది. ఏమిచేయుదును? విధి యనిలంఘనీయము గదా!

వాసంతి॥ అమ్మా! అయినను ధైర్యము ప్రధానము. నిన్నే యాధారముగాఁ బెట్టికొని నీ తండ్రులు తల్లులు రాజమర్యాదను, కుటుంబగౌరవమును గాపాడి కొనఁదలఁచినారు. నేఁటికి రెండుదినములకుఁ బూర్వమే యిడార్ సంస్థాన ప్రభువునకు నొక యజ్ఞాత దేవాలయములోఁ దేజోవతితోడి వివాహము జేసినారు. ఆ సంస్థాన ప్రభువు మాధవరాయ లామెను దోడ్కొనిపోయినాఁడు. కావునఁ దేజోవతీ దేవికి గండము దప్పినది. ఆ యమ్మగారిని గూర్చి మీరు విచారపడవద్దు.

జహా॥ (తనమెడలోని హారమును దీసి) వాసంతీ! చల్లని వార్తను దెల్పి నన్ను భాగ్యవతిగాఁ జేసితివి. మహావైభవముతో నాచెల్లెలికి వివాహము జరుగకుండిన నేమి? సాటి వంశగౌరవములు గలవాఁడు, తన కనురక్తుఁడు నగు రాజపుత్ర వీరునితోడి కరగ్రహణము జరిగినది. అమ్మా! యిట్టి యానందము నా జన్మమధ్యమున ననుభవింపలేదు. దయతో నీ హారమును స్వీకరింపుము.

వాసంతి॥ (ఆనందముతో) తల్లీ! చిరకాలము కీర్తిప్రతిష్ఠలతో బ్రతుకుము. మీ తండ్రులు చెప్పిన యత్యంత ముఖ్యము, ప్రాణప్రదము నగు వార్తగలదు.

జహా॥ ఏమని యాజ్ఞాపించిరి?

వాసంతి॥ అమ్మా! మీరు తేజోవతీదేవిగారితోడి వివాహమునకు నవాబునకు సమ్మతి నిచ్చినటుల నవాబుగారి కోరికపై వ్రాయవలసిన దనియు, దాన నవాబు ననుమానము దీరుననియు వారు హెచ్చరించిరి. ఇది యొక రాజకీయపు టెత్తుగా భావింపవలెను. పెండ్లికి దరలివచ్చునపుడు సులభముగా జయింప నగును.

జహా॥ వారి యాజ్ఞను శిరసావహింతునుగాని—

వాసంతి॥ తల్లీ! నీ యుద్దేశము గ్రహించితిని. నీవు మహాసాధ్వివి. నీ తండ్రులు నీ భర్తకెట్టి యపాయమును దల పెట్టరనియుఁ దెలియును. వలసెనేని తమ ప్రాణముల నైన వాని హస్తగతములు గావింతుముగాని, వాని ప్రాణములను నీకుఁగా నపహరింపమని మాటయిచ్చిరి. ఇది వానికిఁ బాఠమును గఱపుటకు మాత్రమని తెలిసికొనుము.

జహా॥ ధన్యోఽస్మి! ధన్యోఽస్మి! అట్లేకానిమ్ము! లోక కల్యాణార్థము రాజవంశగౌరవప్రతిష్ఠాపనార్థ మీ కపటనాటకమున నానటనాకౌశల్యమును జూపెదను.

ఈ మాటలు ముగిసినవో లేవో దాసివచ్చి 'అవసర కార్యములపై నవాబుగారు మిమ్ముఁజూడ వచ్చుచున్నారు' అనిపలికెను. రాజ్ఞీమణి నవాబు క్రూరచర్యలను దలఁచికొని యేవపడియు, హైందవకాంతలకు వలసిన సతీత్వధర్మ మామె కుగ్గుపాలతోఁబెట్టిన విద్యగావున నెట్టి కొందలపాటులేక గంభీరయై 'అట్లే కానిమ్ము. ఇందులకుఁ జెప్పిపంపనేల' అని పలికి ప్రసంగముమార్చి వాసంతితో నీరీతి మాట్లాడు టకుఁ బ్రారంభించెను:

జహనారా॥ ఏమే! వాసంతీ! నా చెల్లెలి సౌఖ్యము నాది గాదా! ఎవరో పరాయిబిడ్డ నాసవతి యగుటకంటె నానాథునకు నాచెల్లెలు ముద్దులభార్యయై నా కనుంగు నోఁబుట్టువుగా మెలఁగుట నాకు సంతోషము గాదా!

ఇంతలో నవాబు అడుగులసవ్వడి వినఁబడెను. ఆతఁడు కొంకుచు బాలునివలెఁబ్రవేశించుచు నీమాటవిని యచ్చ టనే నిలిచిపోయెను.

అంతలో వాసంతి యిట్లనెను: 'అమ్మా! నీ హృద యము విశాలమైనది. నీమనస్సు తెలియకయే, సంస్థానసింగు ప్రభువులవారు తమ పుత్త్రిని నవాబున కిన్నాళ్లీయ వెఱచిరి. నీ యంగీకారము నేఁడు తెలిసికొంటిని. నీ తండ్రు లీవివాహ మెప్పుడు మహావైభవముగా జరుగునాయని యెదురుచూచు చున్నారు. నీవు నీచెల్లెలు నీయింటిలోనిలుచుటకుఁ దావిచ్చు చున్నావు. నీ గుణము శ్లాఘాపాత్రము' అనెను.

నవాబు ఆనందము మేఁజమీరిపోయెను. శుభముపై శుభము, అనుకూలతపై ననుకూలత వచ్చి పడుచున్నదని యభిప్రాయపడెను. ఇంకను వినెదనుగాకయని వినుచుండెను.

అంతలో జహానారా యిట్లనెను:

'నాచెల్లెలు నాయింటిలోఁ గాక యెవరియింటిలో నుండును? వారు 'ప్రతిమ మహమ్మదీయాంగన యయ్యెనే' అనిరోసిరేమో! నానాఘన కీ బాలిక నీయరేమో! అనియే యిన్నాళ్లు పలుకకుండితిని గాని యిట్టి యభిప్రాయమే వారి కుండినచో నేనే స్వయముగా మా తేజోవతి నలంకరించి పెండ్లికూతును చేయనా' అనిపలికెను.

నవాబు హర్షము మిన్నంటెను. వెంటనే ముసిముసి నగవుతో లోనికివచ్చెను.

జహానారాబీగము తగినమర్యాదలొనరించి లేనిసంతోషము నటించుచు, లోలోన నవాబు కామాంధతకు రోసికొనుచు గంభీరయై నిలుచుండెను.

అహమ్మదుషా॥ ఏమియో ముచ్చటించుచుండ నంతరాయము గల్పించితిని కాఁబోలు!

జహా॥ ఏమియు విశేషము మాటాడుటలేదు. మీరు నాకు చెప్పక దాఁచినను మీ పెండ్లినిగూర్చియే!

అహ॥ ప్రేయసీ! నాయంతరంగ దౌర్బల్యతను క్షమించి యీసారిమాత్రము నా కనుజ్ఞ యిమ్ము.

జహా॥ (గద్గదకంఠియై) అనుజ్ఞనిచ్చుటకు నేనెవ్వతను? మీ యిష్టానుసారముగఁ గార్యములు చేసికొనుచు నా

యాజ్ఞను దీసికొనువారివలె నటింతురు. ఈ కామ పిశాచము, సురాపానభూతము మిమ్ము వదలునట్లు లేదు. నాథా ! ఈ రెండును మీరు విడిచినయెడల మీవంటి యోగ్యుఁడు దేవలోకములో గూడ నుండఁడు.

అహ॥ ప్రేయసీ ! నన్ను దూషింపుము. నన్ను దూషించుటకు నీకు సర్వవిధములగు హక్కులు సంపూర్ణముగా గలవు. నిజముగా నాలో లోపములున్నవి. నేను దుర్బలహృదయుఁడను. నన్ను మనసార క్షమింపుము. నేడు సంస్థానసింగుతోడి వియ్యమునకు సమ్మతింపుము.

జహ॥ ప్రభూ ! మన కనులయెదుట లాలాబాయి, కేవలము దేవతాస్వరూపిణి యెట్లాత్మహత్య గావించుకొనెనో, ఆపవిత్రమూర్తి మీ కెట్టి హితబోధచేసెనో మీరు గమనింపకున్నారు. ఈ విషయమై మీరు ప్రస్తావింపకుండుటయే యుత్తమమని తోఁచుచున్నది. మన యీ యంతఃపురమున కెందఱెందఱు మానవతుల నీడ్చి తుదకెట్టి నరకద్వారమునఁ బ్రవేశింపనున్నారో మీరు గమనింపలేరు.

అహ॥ వేయినరకములనైనఁ బ్రవేశింతును. దశ సహస్ర బాధలనైన భరింతును. నీ వెట్టిశిక్ష నిచ్చినను ననుభవింతును. దేవీ! యీ వివాహమునకుమాత్ర మంగీకరింపుము. హృదయపూర్వకముగ సమ్మతింపుము.

నీవు స్వయముగా నీ వివాహమున కంగీకరించి
నట్లు నీతండ్రులకు జాబు వ్రాయుము.

జహానారాబీగము గంభీరయై యిట్లనెను: 'ప్రభువా!
నాతండ్రులు తమకుఁదామై యీబాలిక నీయ సమ్మ
తించి ఈ వాసంతిని నాకడకుఁ బంపినారు. దైవ
నిర్ణయమును దాఁటలేము. వారికోర్కెయు మీబుద్ధి
యు నొక్కటైనప్పుడు మధ్యను నేనేల యడ్డదవుల
వలయును? కాని ప్రభూ! ఈ దుర్ణయములకుఁ
బశ్చాత్తాపపడు దినములు రాకపోవునుఁడీ!

అహా॥ అట్టిదినములవిషయము లిప్పుడేల? నీవు నీయంగీ
కారమును దెలిపి, ఈవచ్చిన వాసంతిక కావిషయ
మును దెలుపులేఖనిచ్చి తగినరీతి సత్కరించిపంపుము.
నిన్నిదే ప్రార్థింతును.

అనుచు ఆ కాముకుఁడామె పాదములనంటబోయెను.
ఆమె మెలకువఁగా దప్పికొని, 'చాలు లెమ్ము! కార్యాను
కూలములగు నభినయములు' అని పలుకుచు లేచిపోయెను.
నవాబు రెండుచేతులు పట్టుకొని బ్రతిమాలెను. అంత
జహానారా విధిలేనిదానివలె నటించి తనసమ్మతిని దెలుపు
జాబువ్రాసి యందు తన చేవ్రాలు చేసి మడిచి వాసంతిక
కొసంగెను.



# ఇరువదిమూఁడవ ప్రకరణము

## (వాథోజీ సోదరుల మరణము)

ఇరు తెఱఁగులవారు వివాహాయత్నములు గావింపఁ దొడఁగిరి. రెండువైపులఁ గల రాజకుటుంబము లానంద మగ్నములై యుండెను. పెండ్లికి వలయు సంభారములు కూర్చుట మొదలుగాఁ గల సర్వకార్యములు నిర్వర్తింపఁ బడుచుండెను. సేవకులకుఁ జేతినిండ పని చిక్కెను. కొన్ని రాత్రులు వారి కీ కార్యకలాప నిమగ్నతలో నిదురకూడ లేకపోయెను. విదేశములనుండి వస్త్రాభరణాదులు విరివిగాఁ దెప్పింపఁబడుచుండెను. వర్తకులకు మంచి వ్యాపారము జరుగుచుండెను. నూతనప్రదేశములనుండి కతిపయాపూర్వ వస్తుసంతానము విలిచిరి. ఆనందము లక్ష్మి యెచ్చటఁజూచి నను దాండవించుచుండెను.

ప్రజలలో విపరీతభావములు చెలరేఁగెను. వారు సంస్థానసింగుయొక్క గృహాగౌరవము నెఱిఁగినవారు గావునను, అహమ్మనుషా కామాంధత నెఱిఁగినవారుగావునను 'ఈ వివాహమునకు సంస్థానసింగెట్లు సమ్మతించెనా!' అని యనుమానపడసాగిరి. వీరు కేవలము నల్లమందుతిను రాజపుత్త్రులేగాని నీతియెక్కడిదని కొందఱనుకొనసాగిరి. మఱి కొందఱు 'పాపము! సంస్థానము చిన్నది. వాథోజీ సోదరులకుఁ బూర్వము పట్టినగతియే మనకుఁ బట్టనున్నదని వారు

భయపడి సమ్మతించి'రని తలంచుచుండిరి. దేశోద్ధారకులవలె నటించుచు సమయానుకూలముగ సంచరించువారు కొందఱు హిందూమహమ్మదీయైకమత్యమున రెండు తెఱఁగులవారు తోడ్పడుచున్నారని యభినందింపసాగిరి. 'లోకోభిన్నరుచిః' అనిగదా !

వివాహదినములు సమీపించుచుండెను. అహమ్మదు షా నగరమునకు నూటయిరువదిమైళ్ళదూరములో బియోలా మైదానము గలదు. అది సౌందర్యోపేతము, సుప్రసిద్ధము నైనది. అయ్యది సస్యజలసమృద్ధమై విశాలమైన భూమి గలదియైన ప్రదేశము. ఈ ప్రదేశమునకిపు డిరుతెఱఁగుల వారు సంస్థానసింగు నిర్ణయముపై నరుగవలసియుండెను.

నవాబు తగినపరివారముతో బయలుదేరెను. తన సేనలను నచ్చటికి రానీయలేదు. ముఖ్యులను సేనానాయకులను దనఠీవికిఁ దగిన సంఖ్యావిధేయమగు సైన్యమును వెంబడిఁ గొనిపోయెను. జహనారాబీగము అంతఃపురకాంతలతోఁగూడ నాలుగువందల సవారీలతో గూడ బయలు దేరెను. వారికి సంరక్షకబలముగా నైదువందల సంఖ్యగల యాశ్వికులు మాత్రము వచ్చుచుండిరి. నవాబునకుఁ గల యాంతరంగికపరివారము కరితురగములపై నెక్కి రెండువేల సేనకుమించి వచ్చుచుండెను. బలవంతులగు వాథోజీసోదరు లిరువైపులనుండిరి. మొత్తముపై పరివారమంతయు నైదు వేలకు మించియుండదు.

లక్షలకుమించిన యహమ్మదుషాసేన యంతయు 'అహమ్మదుషా' నగరముననే యుంచఁబడెను. ఎట్టి యుద్ధ సామగ్రియులేదు. పెండ్లికి వలయు సంభారములు మాత్రమే. పండితులు, గాయకులు, మౌల్వీలు, పురోహితులు నూటికిఁ బైగా నుండిరి. వీరు దేశదేశాంతర ప్రఖ్యాత విద్యలు గలవారు.

బియోలా సమమై యందమై విశాలమైనభూభాగము. ఇరుతెఱఁగులవారు నిలుచుట కనువైనతావు. వివాహము నకుఁ దగిన స్థలము. ఈ ప్రదేశమున నింతకు పూర్వము గతి పయ రాజకుటుంబముల వివాహములు జరిగియుండెను. ఆకారణముచే నియ్యది పెండ్లిభూమియనియుఁ బేరెన్నిక గనెను.

అహమ్మదుషా తరలుటకుఁ బూర్వమే సంస్థానసింగు బలవంతసింగులు తమ పరివారముతో బయలుదేరి యిటకు వచ్చి గుడారములు వేసికొనియుండిరి. వీరితో నైదువందలు మేనాలు వచ్చెను. సుమారు రెండువేల కరితురంగ ముల బలమును, నొకవేయి యితరపరివారమును వచ్చెను. వివాహమును జూడవచ్చిన వారిలో మాథక్ సంస్థానపతి రావల్ శత్రుశూల్జీ ముఖ్యుఁడు. ఇతఁడు వేయికిమించిన తన పరివారముతోగూడ వచ్చెను. పెండ్లికుమారుని నాహ్వానించుటకై తగుప్రయత్నము లానందముతో నుత్సా హముతో చేయఁబడుచుండెను. హైందవ సాంప్రదాయముల ప్రకారము వివాహమును సమ్మతించిన నవాబునుగూర్చి

సంస్థానసింగు పరివారము పలుచోట్ల పొగడుచుండెను. వీరితోబాటు నవాబుసేవకులుగూడ నచ్చట గలరు. వారును వీరును నుల్లాసముగ నుండిరి.

నవాబురాకకై యందఱు వేయికన్నులతో నెదురుచూచుచుండిరి. అనేకవిధములగు వినోదములు జరుగుచుండెను. దేశభక్తిని ప్రబోధించునట్టి వీరగాథ లొకవంక చెప్పంబడుచుండెను. వేఱొకచోట రాజపుత్త్రుల శౌర్యమును దెలుపు జాతీయగీతములు పాడంబడుచుండెను. కొండొకకడ గీతవాద్యములతోంగూడిన గాయకుల మనోహర గానములు ప్రకీర్ణితములై విమోహింపంజేయుచుండెను. కొందఱు చిత్రకళా కౌశల్యమును బ్రదర్శించు సామగ్రులను బారులుదీర్చిన యంగళ్ళలో నమ్ముచుండిరి. విప్రవినోదులు మొదలగువారు వివిధవేషముల నభినయించి కడుపులు చెక్కలగునట్లు నవ్వించుచుండిరి. శ్రీరామాయణ భారత భాగవతములు శ్రవణపేయముగ సంగీత సాహిత్యముల నందెవేసిన మేధావులు మనోహరముగం జదువుచుండిరి. కొన్నిస్థలములలో అహమ్మదుషా పటములు, 'హిందూమహమ్మదీయ సఖ్యతకై పాటుపడిన మహాత్ముండు' అను పెద్ద పెద్దయక్షరములతోం జిత్రించి హైందవ వర్తకు లమ్ముచుండిరి. కొన్నిచోట్ల ఆతని కీర్తిని గూర్చి గాయకులు గానముచేయుచుండిరి. కతిపయ ప్రదేశములలో భజనలు, హరికథలు, నింద్రజాలాది వినోదములు పెక్కు తెఱంగుల జరుగుచు వచింపవీలులేని, రచింపశక్యముగాని వైఖరిగనుండెను.

క్రమముగా నవాబు తన పరివారముతో బియోలా మైదానమును సమీపించెను. అత్యంత వైభవపూర్వకములగు సన్నాహములతో, నృత్యగీతములతో, వారాంగనలతో, వివిధఖాద్య మద్యములతో, నమూల్య వస్తువితానముతో బయలుదేరెను. ఏనుఁగుల ఘీంకారములు, హయహేషితములు, భటులకోలాహలములు మిన్నుముట్టెను. నవాబొక నీరంధ్రమునుబోలు భద్రమత్తేభముపై సింహాసనమువలె వివిధ రత్నాలంకారశోభితమై వెలయుచున్న యున్నతాసనముపై నాసీనుఁడై యుండెను. ఈతనికి ముందుభాగమున వాథోజీయు, వెనుకభాగమున జితోజీయు సర్వశుభలక్షణ సమన్వితములగు నాజానేయముల నధిరోహించి రాజఠీవితో వచ్చుచుండిరి. సామంతులు, సరదారులు, మహామాత్యులు వారివారికిఁ దగిన వైభవముతోఁ దరలి వచ్చుచుండిరి. అహమ్మదునగరమనెడు నమరావతీపురమునుండి వెలువడిన దేవేంద్రునివలె అహమ్మదుషా ప్రకాశించెను. ఆశ్రయించి యరుదెంచుచున్న పరివారము బృందారక బృందమువలె నుండెను.

నవాబు వచ్చుచున్నాఁడను కోలాహలము సంస్థానసింగు పరివారములో చెలరేఁగెను. సమీపించిన నవాబునకీ క్రిందివిధముగా వర్తమాన మంపఁబడెను.

'మా యాహ్వానము నంగీకరించి, మా సపర్యలకు సమ్మతించి బియోలాకు విచ్చేసిన మీకు మా యభినందనములు. మే మానందోద్రిక్తులమై మా రాజపుత్రి మర్యాద

చెప్పనఁ జేయు గౌరవములకుఁగాని యపహాస్యములకుఁ గాని తప్పుపట్టవలదని మా ప్రార్థన. భగవంతుఁడు మేలు చేయుఁగాక !'

మైదానప్రదేశమునకు వెలుపలిభాగమున నొక సౌందర్య సంయుక్తమగు నున్నతద్వార మేర్పఱుపఁబడి యుండెను. అక్కడ మూఁడువందల గజముల దూరమున కొక్కొక్కద్వారము చెప్పనఁ గట్టఁబడియుండెను. అందు ప్రధానమగు ప్రథమద్వారమునకు 'అహమ్మదుషా దర్వాజా' అను నామకరణము చేయఁబడి 'స్వాగతము' సువర్ణాక్షరములతో వ్రాయఁబడియుండెను. హిందూమహమ్మదీయ సమ్మేళనమును దెలుపు పతాకములు ద్వారమున కిరుప్రక్కల నెగురుచుండెను. మామిడితోరణములు, రంభాస్తంభములు పట్టువస్త్రములు, ద్వారకుడ్యముల కలంకరింపఁబడి యుండెను.

నవాబు పరివారము సమీపించెను. ప్రథమ ద్వార ప్రదేశమును జేరునప్పటికి ఆతని గౌరవార్థముగ నిరువది యొక్క ఫిరంగులు ప్రేల్చఁబడెను. నవాబీయేర్పాటుల కన్నిఁటికి నమితముగా నానందించెను. ద్వితీయద్వారమును గడచునప్పుడు నలువదిరెండు ఫిరంగులు గౌరవార్థము ప్రేల్చిరి. అంతలోనిలువక రాజపుత్రికల యాచారము చెప్పన వసంతజలము, నెఱ్ఱని బుక్కాపొడి, లవణము, మట్టి విశేషముగా వర్షింపఁబడెను. ఈ యాచారక్రియలకు నవాబు పరివారముతోపాటోర్చికొని తృతీయద్వారమును సమీపించు

నప్పటికి రాజగౌరవార్థముగా నరువదిమూఁడు ఫిరంగులు ప్రేల్చఁబడెను. సంస్థానసింగు పరివారముచేయు వేళాకోళపుఁ బనులకు మితిలేకపోయెను. నవాబు లోలోన ముసిముసినవ్వులు నవ్వుకొనుచుండెను.

క్రమముగా మూఁడవద్వారమును నిర్గమించి, నాలుగవద్వారము సమీపించునప్పటికిఁ బరియాచకములు, కోలాహలము లెక్కుడయ్యెను. అంతయు గందరగోళముగా నుండెను. ఆకస్మికముగ నవాబుపక్షమునందలి పరివారము నేల కొఱఁగుటకుఁ బ్రారంభమయ్యెను.

నవాబు పరివారవర్గములో కలఁతపుట్టెను. ఇయ్యది ప్రమాదవశమున జరిగిన నష్టమేయని తొలుదొల్త నను కొనిరిగాని ఫిరంగులవర్షమునకు మితిలేకుండెను. వందల కొలఁది సైనికులు పడుచుండిరి.

ఇంతలో నాకస్మికముగ రెండుగుండులు వచ్చి నవాబున కిరుపార్శ్వములనున్న వాథోజీ జితోజీల వక్షస్థలము లనుదాఁటి రక్తమునుగ్రోలి విగతాసులఁజేసి నేలను బొరలించెను. రక్తప్రవాహములు పాఱుచుండెను. ఇంతలో కనువిచ్చి నవాబు మోసమయ్యెనని గ్రహించి తల్లడిల్లెను. కాని యేమియుఁజేయుటకుఁ దోఁచక, తోఁచినంతవఱకు యుద్ధము చేయవలసినదిగా తన పరివారమున కాజ్ఞనిచ్చెను. అహమ్మదునగరమునుండి క్రొత్తసేనలఁ దెచ్చుటకై యుత్తరువు లీయఁబడి సరదారులు కొందఱు పయనమైరి. ఈ విధముగాఁ బరిణయభూమి రణభూమిగా మాఱిపోయెను. అహమ్మదుషా ప్రణయస్వప్నము రణప్రధానమై తోఁచెను.

# ఇరువది నాలుగవ ప్రకరణము

## (ప్రతాపసింగు పతనము)

సంస్థానసింగు పక్షమునవచ్చిన మేనాలనుండి యుక్కు తునుకలవంటి యుద్ధభటులు వెలికురికిరి. విప్రవినోదులు, వర్తకులు, గాయకులు, వేషధారులు, భజనపరులు నిర్భీక రాజపుత్రి దళముగా మాఱిపోయెను. అమ్మబడుచుండిన యహమ్మదుషా పటములన్నియు నాతనియెదుటనే భస్మము చేయఁబడెను. అహమ్మదుషా గౌరవార్థము రచింపఁబడిన ద్వారములు కూలద్రోయఁబడెను.

నవాబతియత్నమున నాత్మరక్షణార్థమగు యుద్ధము చేయుచుండెను. ఈతఁడు పేరెన్నికగన్న వీరుఁడు. వయసున నలువదియైదుమించినను, నింద్రియలోలుఁడయ్యును వజ్రశరీరుఁడు. సింహపరాక్రముఁడు. ఈతని కరవాలమునకు రాజపుత్రి సైన్యములో చాలభాగము తెగిపోయెను.

ఒకవైపున నింతకుమించిన వినాశనము నవాబుసైన్యమున జరుగుచుండెను. శ్రీరామలక్ష్మణులవలె సంస్థానసింగు ప్రతాపసింగులు విజృంభించిరి. వీరు రెండుచేతులఁ గరవాలములు ద్రిప్పుచు హుంకారమాత్రమున నరివీరహృదయ విదళనము గావించుచు రణరంగమునఁ బ్రళయనృత్యముచేయుచు మృత్యుదేవతయొక్క ద్వితీయావతారమువలె నుండిరి. ఆ దుర్నిరీక్ష్య తేజోరాసులు మధ్యందిన మార్తాండుని లీల

వెలుగుచుండిరి. వారిని డేతిచూచుట కెవ్వరితరము గాక పోయెను. వారి యుద్ధనైపుణ్యము దర్శింపఁ దగినదేగాని వర్ణింప వలనుపడదు.

ఒక గంటలో బియోలాప్రదేశము నంతటను రక్త నదులు పాఱెను. మాంసపంకములు, క్రొవ్వుబుడగలుగలిగి, ఖండితశవరాసులనెడు కొండలు లోనఁగలిగి ప్రళయజలధి ననుకరించెను. ఎచ్చట చూచినన్న విలయభీకరతాండవమే! ఏవైపునఁ గనుగొన్నను వీరవరుల సింహనాదములే! మృత్యువు సర్వప్రదేశముల నిరంకుశముగా వికటాట్టహాస ముతో సంచరించుచుండెను.

అహమ్మదుషా ఆత్మరక్షణమునందు పరశిక్షణము నందు నప్రతిమానుఁడై యుండెను. అతని ధాటి కెవ్వారును నిలువఁజాలక పోవుచుండిరి. అనర్గళవీరవిహారము! ఇది సంస్థానసింగు చూచి యాఁకొన్న బెబ్బులివలె నాతనిపైఁ బడెను. హుంకార నినాదపూర్వకముగ దిగ్దిగంతములు మాఱుమ్రోగునట్లుఱుచు సంస్థానసింగు నవాబు నెదిరిం చెను. సంస్థానసింగును చూచినమాత్రముననే నవాబున కా పాదమస్తకము కోపావమానములతో మండిపోయెను. నర నరమున రక్తముప్పొంగెను. ఒక్క పెట్టున నాతనిపైఁబడెను. ఆతని వ్రేటును దప్పించికొని సింగు నవ్వుచు, 'అల్లుఁడా! వచ్చితివా! మృత్యుకన్యక నిన్నాహ్వానించినదా' అని పలికి "నీచుఁడా! లాలాబాయివంటి రత్నము నీమూలమున హత మాఱిపోయినది. ఇంక నెందఱు రాజకన్యలను పరాభవించి

యెన్నిరాజవంశములను నాశనము చేయనున్నావు? నేఁడు నాకంటఁబడితివి. నేఁడు నీకు రక్షణములేదు. పశువా! నీ పనులు దుస్సహములుగదా!' అని భయంకరముగా నుల్లస మాడెను. ఈమాటలు విషదిగ్ధశరములవలె నవాబు కఠోర హృదయమునుబగిలించెను. ఆతని కర్కశహృదయపర్వతము సంస్థానసింగు వాక్యవజ్రాహతిచే పగిలిపోయెను. నవాబు చెద రిన గుండియలు చేతఁబట్టుకొని యట్టహాసముచేసి 'పిరుఁడవు గదా! రాజపుత్త్రుఁడవుగదా! మోసగించితివేల? నీవంటి నీచుఁడులేఁడు!' అనిపలికెను. 'మోసమును మోసముచేతనే గెలువవలయును' అను రాజనీతి నీకుఁ దెలియదా? రాజనీతి దెలియకయే సింహాసన మధిష్ఠించితివా! అవును. పట్టు పాన్పులు, పానీయములు, పరనారులు, పరిపరిభోగములు గలవరించు మానవరూపపశువునకు రాజనీతివ్యవహారమేమి తెలియును' అనుచు నాతని గొట్టెను. ఆ దెబ్బను చేతికత్తి తో అహమ్మదుషా యాచికొనెను. కాని యాయాఘాత ముచేఁ జేతియందలి కైదువు విఱిగిపోయెను. శరీరమాద్యంత మొక్కుమ్మడి కంపించెను. అంత సంస్థానసింగు హుంకరించి 'నీ యదృష్టము బాగున్నది' అనుచు విజయోన్మాదియై మీఁ దికి లంఘించి యాతనిమెడ నొడిసిపట్టుకొనెను. ఇది యావే శముచే జేసినపనియేగాని తొందరపడినాఁడు. ఇంతలో. నవాబు, చేతియందలి సన్ననికత్తినెత్తి యాతని పొట్టలో దూర్పఁ బ్రయత్నించెను. క్షణములో సంస్థానసింగు ప్రాణ ములు పోవనుండెను. ప్రతాపసింగు గుభాలున నచ్చటికివచ్చి

యహమ్మదుషా కవచితకరముపై పిడుగునుబోలు నాఘాతమువైచెను. ఆదెబ్బతో నాతనిభుజమెల్ల గంపించెను. ఇంతలో సంస్థానసింగు తప్పుకొనెను. ఇరువురితోఁపోరు నవాబునకు భరమయ్యెను. అంత ప్రతాపసింగు తన యన్నను జూచి 'ఈమద్యపానప్రియునితో యుద్ధము చేయుట కిందతేల! అదిగాక వీనిని చంపుచుద్దేశము మనకు లేదుగదా! వీనికిఁ దగిన ప్రాయశ్చిత్త మొనరించి ప్రాణములుమాత్రము నిలుపుదము.' అనిపలికెను. సంస్థానసింగు నవాబునుజూచి 'అల్లుఁడా! మీ చిన్నమామ గారేమో పలుకుచున్నారు వినుము' అని పకపకనగుచు వెడలిపోయెను. నవాబుపాట్లను గాంచి, హతశేషులగు మహమ్మదీయసరదారులు మిగులఁ జింతించుచుండిరి.

ప్రతాపసింగునకు, నహమ్మదుషాకును బోరు ఘోరమయ్యెను. అయ్యది రామ రావణ యుద్ధమును బోలియుండెను. ఇరుతెఱఁగులవారి కయ్యది భయంకరముగనుండెను. ఆస్థలమునకు మహమ్మదీయులు పోకుండ సంస్థానసింగును, రావల్ శత్రుశాల్జియుఁ బోరాడుచుండిరి.

ఇంతవఱకు అహమ్మదునగరమునుండి సైన్యములు రాలేదు. హోరాహోరిగాఁ బండ్రెండుగంటల పరిమితిగల కాలము యుద్ధము జరిగెను. విరోధులాసలెల్ల వదలుకొనిరి. రాజపుత్రవీరులు అహమ్మదుషా సైన్యము లరుదేరక ముందే యుద్ధము ముగించి యాతని బంధింపఁ దలచుచుండిరి.

అహమ్మదుషా బలము క్షీణింపసాగెను. ప్రతాప సింగు ప్రహాసముగావించి భ్రూవిక్షేపమొనరించి యాతనిపై కుతికెను. అప్పటికి నవాబు కవచము చీలియుండెను. శిరస్త్రాణమూడిపోయెను. చేతఁగల యాయుధములు విఱిఁగి భూమిపై తొలఁగిపోయెను. ఆయాసముచేత నిట్టూర్పులు నిగిడించుచు నోడలెల్లఁ బూఁచిన మోదుగుమ్రాఁకువలె నెత్తురిరక్తముచేఁ బ్లావితమైయుండఁ గోలలుపెటికిన బెబ్బులివలె రోజుచుండెను. ప్రతాపసింగు వానినిఁ బట్టికొని యచ్చటఁగల యొక రథస్తంభమునకుఁగట్టి యిట్లు పలికెను:

'వీరుఁడా! నీ రణోన్మాదము, నీ కామోన్మత్తత నీ యహంకారాధికారము నేఁటితో తీఱెననుకొందును. రాజపుత్రవీరులన నెట్టివారో నీవెఱుఁగవు. నిప్పుతో చెలగాట కములాడితివి. కాలాహిని కాలఁదన్నితివి. నిద్రించు సింహపు సటలఁబట్టి యూయెల లూఁగితివి. రాజపుత్రస్త్రీలనినచో నీకుగా సృష్టింపఁబడిన విలాసవతులుగాఁ దోచిరేమో! ఇపుడు నీవు నిరాయుధుఁడవు. స్వర్గమును చూఱగొనిన తల్లి లాలాశాయి యేకారణమున నిన్ను పడకటింటిలో చంపక విడిచినదో నేనును ఆకారణముననే, అనఁగా మా దురదృష్ట వశమున నీవు మా ప్రతిమకు భర్తగా నేర్పడినవాఁడవు గావున నీకు గుణపాఠముమాత్రము నేర్పి ప్రాణదానము చేసినాను. ఇప్పుడు నిన్ను ఖండఖండములుగా ఖండించి కాకులకుఁ గుక్కలకు నక్కలకు వేయఁగలను. కాని చేయను. ఇఁకముందు రాజపుత్త్రుల నవమానింపఁబోకుము. అట్లయి

నచో నీ ప్రాణములు కేవలము దక్కవు. ఓరీ! నీ కావరము నేటికైనను నశించినఁ జాలును. ప్రజలను కన్నబిడ్డలవలెఁ గాపాడుట నీకు నీతిగాఁ దోపలేదు. నీచుఁడా! క్షత్రియులయ్యు గులపాంసనులైన వాఘోజీజిత్తోజీలు నిన్నుఁ బ్రేరేచి యింక నేయే రాజవంశముల విధ్వంసము చేయనున్నారో యను భయముచే వారిని తొలిగుండు ప్రేటున కెఱచేసిన వానిని నన్నుగాఁ దెలిసికొనుము. నిన్నుఁ జంపఁదలఁచియుండునెడల నప్పుడే వారితోపాటు గూల్చియుందును. రాజపుత్త్రిల కరుణయెట్టిదో తెలిసికొని పులి నాకివిడిచిన మేఁక వలె నేఁటినుండి రాజపుత్త్రిల పాదదాసుఁడవై బ్రతుకుము. నీకు నలుబదియైదేండ్లు నెత్తిపైకెక్కినను, మహాసాధ్వియగు జహనారాబీగమును సతిగాఁబడయఁగల్గియు, వందల కొలఁది యంతఃపురాంగనలు నీకు విలాసవతులుగా నుండియు, రాజపుత్త్రిల నవమానితులఁ జేయుటకేగదా మా వంటివారితో వియ్యమందెదనంటివి. వియ్యమెట్టి కయ్యముగా మాఱెనో చూచితివా! పెండ్లికిఁ దరలివచ్చిన యో వరుఁడా! యీ పరియాచకముల నోర్చికొనుము. పాపము! భోగ లాలసుఁడవు! పశువునకుఁబోలు మేధను గలవాఁడవు. నీకేమి తెలియును? నిన్నిట్టివానిఁగా సృష్టించిన మతిలేని విధాత ననవలెను.'

ఈ మాటలు బంధితుఁడగు నహమ్మదుషా కొక్కొక్క నిశితబాణమువలె గ్రుచ్చికొనుచుండెను.

ఇంతలో సైన్యములో గొప్ప కలకలము బయలుదేరెను. ఆకస్మికముగా నొక్కబాణమువచ్చి ప్రతాపసింగు హృదయమున గ్రుచ్చికొనెను. ఆతఁడు నిలువునఁ జైతన్య హీనుఁడై కూలిపోయెను.



# ఇరువదియైదవ ప్రకరణము

## (ప్రతాపసింగు మరణము)

మహమ్మదీయ సేనలు అల్లానామమును స్మరించుచు విజృంభించెను. వేలకొలఁది క్రొత్తసైన్యము వచ్చుచుండెను. భాగీరథీస్రవంతి పొంగి పొరలి యావలి గట్టునుండి యీవలి గట్టునకుఁ బ్రవహించినటులుండెను. ప్రతాపసింగు పాటును, నీ సైన్య విజృంభణమును జూచిన బలవంతసింగు సమయానుకూలుఁడై తమ్ముని మఱి నలుగురనుచరుల సాహాయ్యమున సురక్షితముగా నెత్తికొని భద్రస్థలమునఁ జేర్చెను. రాజపుత్రసైన్యములు తెగించిపోరాడెను. కాని యెనుఁబది వేల గజాశ్వీక భటసైన్యముకడ నాలుగువేల రాజపుత్ర వీరు లెంతసేపు యుద్ధముచేయఁగలరు?

ఆ మహాయుద్ధ సముద్రమున మంథరగిరివలె నెచ్చటఁ జూచినను తానై రావల్ శత్రుశల్యమాత్రము పోరాడు చుండెను. ఆతఁడు తన సేనతో యుద్ధముచేయుచు మహమ్మదీయులకు దిగ్భ్రాంతిని గల్పించుచుండెను. ఆతఁడు తన సంస్థానమునుండి సిద్ధపఱుపఁబడి యుక్కుతునుకలవంటి

యైదువేల సైనికులఁ దెప్పించెను. వారు స్వామిరక్షణార్థమై తెగించి పోరాడుచుండిరి. పోరు సంకులమై ఘోరాతిఘోరమై దేవదానవ యుద్ధమును బోలెను. నాఁటి శత్రుశూల్జీ మహారాజు విలయశూలిని బోలియుండెను. ఈతనిఁ జూచినచో ప్రళయయమునిఁ జూడఁ బనిలేదు.

శత్రుశూల్జీ యాజానుబాహుఁడు. ఆకర్ణనేత్రుఁడు. రెండుచేతులతో నాతఁడు విజృంభించునపుడు సవ్యసాచినిఁ బోలియుండెను. ఆతఁడు మత్త కుంభీంద్రముపై కఱుకు వనగజమువోలె నహమ్మదుషాపైఁ బడెను. ఆ దృఢకాయము ప్రహారసహస్రముల చేత శతధారంధ్రములుగల జల్లెడవలెనుండును. నిరంతర రక్తధారలు ప్రవహించుచుండెను. అహమ్మదుషా సొమ్మసిలెను. అపాయము గమనించి యంగరక్షకులగు మహావీరులు నవాబును గాపాడిరి. శత్రుశూల్జీ నెదిర్చిరి. శత్రుశూల్జీ రాజపుత్రిసైన్యమువారిని తీవ్రముగాఁ దాఁకెను. అంభోధిద్వయము గలిసినట్లయ్యెను. బ్రహ్మాండమగు ప్రళయనినాదము వినవచ్చుచుండెను.

ఎంతటి వీరుఁడయ్యు నెనుఁబదివేల సైన్యము సముద్రపు టలల రీతిఁ బైబడినప్పు డేమిచేయఁగలఁడు? ఆతనికై పోరాడి సుప్రసిద్ధ రాజపుత్రి వీరులెందఱో వీరశయనము నలంకరించిరి. పోరిపోరి, శత్రువులఁ జకితులుగాఁ జేసి చేసి, తుదకు శత్రుశూల్జీ మహారాజు బందీయయ్యెను.

నవాబు క్రోధతామ్రాక్షుఁడై యాతనిశిరమును దెగవ్రేయఁ, దన దీర్ఘకృపాణము నెత్తెను. ఇంతలో నెవ్వఁడో

యొకడువచ్చి నవాబు చెవిలో నేమియో యూఁదెను. వెంటనే నవా బెత్తిన కత్తిని డించి 'ఈద్రోహిని దీసికొనిపోయి కారాగారమున నుంచుఁడు' అని యాజ్ఞ నిచ్చెను.

విజయోన్మత్తులగు మహమ్మదీయులు కొల్లధనముతోను ఖైదీలతోను దరలిపోవుట కుద్యుక్తులైరి. ఇంతలో నెక్కడఁజూచినను కోలాహల వాక్యములు వినవచ్చుచుండెను. మహమ్మదీయ సరదారు లిటునటు నున్మత్తులవలె తిరుగులాడుచుండిరి.

'జహనారాబీగము గాన్పింపలేదు ; కాన్పింపలేదు. మహారాజ్ఞిని వెదకుఁడు; వెదకుఁడు' అను నినాదములు మిన్నుముట్టెను.

అశ్వికులు నలుదెసలఁ బర్విడిరి; చుట్టుప్రక్కల ననేక స్థలములయందు వెదకిరి. ఆమె జాడ గాన్పింపలేదు. బీగమును రాజపుత్రులు చెఱపట్టికొని రనుభావము అహమ్మదుషా హృదయమునఁ దోఁచెను.

అహమ్మదుషాకుఁ దలకొట్టినట్లయ్యెను. తనవిజయము తన కానందదాయకము గాకపోయెను.

'మహారాజ్ఞి లేని సామ్రాజ్య మేల' అని తలపోయ సాగెను. ఇంతలో నొకచారుఁడువచ్చి 'ప్రభూ! ఇచ్చటి కెనిమిదిక్రోసుల దూరమునఁగల యొక యడవిలోఁ గల శిథిల దేవాలయమున నెవ్వరోయుండు జాడగాన్పించుచున్నది. అచ్చట బీగమున్న దేమో యను సందేహము గలుగుచున్నది. లోనఁ బ్రవేశింపఁజూచువారి నొక యజ్ఞాతవ్యక్తి

ద్వార దేశముననే ఖండించుచున్నాఁడు.' అని పలికెను. అంతట నహమ్మదుషా గాయ బాధితుఁడయ్యు తానే స్వయముగా ఆ ప్రదేశమునకు దరలెను.

అందఱు నచ్చటికిఁ జేరిరి. భటులిదివఱకువలెనే లోనఁ బ్రవేశింప యత్నించిరి గాని యవకాశము గలుగలేదు. అంత నహమ్మదుషా సాహసించి ద్వారముకడకుఁ జని 'లోనఁ గలవారు నాకు శత్రువర్గములోనివారైనను మిత్రవర్గము లోనివారైనను వారికి సంపూర్ణాభయ మిచ్చుచున్నాను. ద్వారము తెఱువవలసినదిగా అహమ్మదుషాగోరుచున్నాఁడు' అని బిగ్గరగా పలికెను.

వెంటనే ద్వారము గుభాలునఁ దెఱువఁబడెను. తెఱచినవ్యక్తి యొక స్త్రీమూర్తియై యుండెను. ఆమె కరమునందు కరవాలము తళతళ మెఱయుచుండెను. కన్నుల నిప్పుకణము లురలుచుండెను. మహిషాసురమర్దనియగు భద్రకాళివలె నామె గాన్పించుచుండెను. ఆమె యెవరు? జహానారాబీగము!

నవాబు స్తంభితుఁడయ్యెను. ఆమె యొక సామాన్య వస్త్రమును ధరించి నిరస్తభూషణయై యుండెను.

'ప్రభూ! కసిదీఱలేదా! ఇచటికిఁగూడ నా పిన తండ్రిని తెలుసుకొని వచ్చితిరా?' అనెను.

నవా॥ పెండ్లి యనిచెప్పి నన్ను మోసగించినవాఁడు నీ పిన తండ్రియైనంత మాత్రమున దండ్యుఁడుగాఁడా! అది

యటుల నుంచనిమ్ము. నీ కీయున్మత్తవేష మేమి? శత్రువుల పక్షమునఁ జేరితివా యేమి?

జహా॥ శత్రులెవ్వరో మిత్రులెవ్వరో నేను తెలియలేకయు న్నాను. నా ప్రాణనాథుఁడే నేఁడు నాకు శత్రుఁడై నాఁడు. కాని నేనాతనికి శత్రువుగాలేదు. నేనే వైరి పక్షమునఁ జేరియుండినచో నిన్నాళ్లు మీ రీ సింహాసన మునఁ గూర్చుండఁజాలరని మీ హృదయమే చెప్పుట లేదా? నేనే పతియాజ్ఞను బాలించనిదాన నైనచో నే నాఁడో యీ మహత్తరసామ్రాజ్యము బొమ్మ రిల్లుచందమున నా పదాఘాతమాత్రమున సధఃపా తాళమునకుఁ జెదరి వినాశనమైపోయి యుండెడిది.

నవాబు స్తంభించిపోయెను. ఇట్టి గంభీరము, నిశితము, సత్యబద్ధము నగు వాక్యపుంజము జహనారాబీగము నోటినుండి నిర్భీకముగ వెడలునని యాతఁడనుకొనలేదు; ఆతఁడు మెల్ల గా పసిపాపవలె 'దేవీ! నిజము. అందుచే నిన్ను శంకింపను గాని నీ యీ విపరీతవర్తనమునకు సమాధానమేమి? ఎట్లు నీవు స్కంధావారమును విడిచివచ్చితివి ? ఇది వంశమర్యాద కు లోపముగాదా!' అనెను. జహనారాబీగ మీతని మాట లకు వికటముగా నవ్వి, 'ఇది వంశమర్యాదను, నవాబు మర్యాదను నిలుపుమార్గము. కామోన్మత్తతచే, సర్వ ధ్వం సముచేసికొని నరకద్వార ప్రవిష్టున్మతియగు నవాబునకు నా పలుకు లెట్లర్థమగును' అనెను.

ఈ రీతిగా జహనారాబీగమెన్నఁడు తనభర్త నుపాలంభించి యెఱుఁగదు. ప్రతివాక్యము నింతగను, కొంగ్రొత్తగను, నిశితముగను నాతనికిఁ దగులుచుండెను. కాని మంత్రముగ్ధమగు పాముచందమున నామె పవిత్రమూర్తి సన్నిధానమున నతఁడు స్తంభించిపోయెను. ఇంతలో గొల్లుమని లోనుండి యొక రోదనధ్వని వీతెంచెను. జహనారా దుఃఖముతో 'ప్రభూ! మీ పాపకార్యములకు ఫలితము చూడ లోనికిరండు' అని తోడ్కొనిపోయెను.

దేవాలయాంతర్భాగము విశాలముగనుండెను. అందు శ్రీ సీతారామలక్ష్మణుల విగ్రహములుండెను. గచ్చుచేయఁ బడిన పరిశుభ్రమైన భాగమున మెత్తని పాన్పుపై నొక పురుషమూర్తి గతసంజ్ఞుఁడై పడియుండెను. ఆతని పాదముల చెంత నొకవికీర్ణకేశభారయగుస్త్రీ ముక్తకంఠముతో నేడ్చుచు నాతని శరీరమును ప్రణయపూర్వకముగఁ దాఁకుచుఁ గౌఁగిలించుచుండెను. దృశ్యముహృదయదారకమైయుండెను. అహమ్మదుషా ఆమెనుగాంచి యాశ్చర్యపడి 'ఏమి! సరళయా!' అనెను. జహనారాబీగమేడ్చుచు 'ప్రభూ! ఈమె నగౌరవపఱుపకుఁడు! ఈమె ప్రచ్ఛన్నవేషమున మన యంతఃపురమున నుండిన నా పిన్నతల్లి. ఇప్పుడిచట మరణయాతనలోనున్న బలవంతసింగు మహారాజు నర్ధాంగి, సరళామహాదేవి' అనెను.

అహమ్మదుషా గంభీరుఁడై యాలోచించి 'అట్లనా? ఈమె నీ పినతల్లియని నీకు మొదటినుండియుఁ దెలియునా?' అనెను.

అందలి భావగంభీరతను, క్రూరతను గమనించిన రాణి కనుబొమ్మలు ముడివైచి 'నాకు నాఁడుదెలిసినచో మీ కడఁ దాఁచనేల? నన్నేల సంశయించెదరు?' అనెను.

అహమ్మదుషా మరల నోరెత్తఁడయ్యెను. ప్రతాపసింగు ప్రాణప్రయాణయాతనలో నుండెను. సరళాదేవి యాతనికి విసరుచుండెను. జహనారాబీగము పాదములు పట్టుచుండెను. ఆకస్మికముగ శ్వాసమాగిపోయెను. సర్వము శూన్యమై యంధకార బంధురమయ్యెను.

జహనారా దుఃఖము చెప్పనలవి గాదు. నవాబాస్థలమును వీడఁ దొందరపెట్టుచుండెను. ఆమె యెట్లో సరళనూరార్చి వలసిన పరివారమునిచ్చి సంస్థానసింగు రాజ్యమునకు దరలవలసినదిగా దెల్పెను. గతించిన పినతండ్రి పాదములు పట్టికొని యేడ్చెను. ఉన్మత్తప్రాయయగు సరళాదేవిని మరల మరల కౌఁగిలించికొనెను. తుదకు క్రోధియగు నవాబామెను లాగివైచెను. జహనారా కఠినహృదయవలె త్వరత్వరగా నచ్చటినుండి కదలిపోయెను.

కొంతసేపటికిఁ బరిసరారణ్యమునుండి యనుచరునితో నొక్క ప్రసిద్ధవైద్యునితోగూడ సంస్థానసింగు ప్రొద్దుపోవు వేళకు ముందుగా దేవాలయముచేరెను. కాని యాతఁడు వచ్చునప్పటి కట నెవ్వరు గాన్పింపరైరి. అయ్యది యాతని కాశ్చర్యభయములను గల్పించెను. ఆతఁ డిటునటు తిరిగి చూచెను. కాని యెవ్వరును గాన్పింపరైరి. సరళాదేవి యేమయ్యెను? ప్రతిమాదేవి యేది? అనుఁగుఁదమ్ముఁడు ప్రతాప

సింహుఁడెక్కడ? ఈ యాలోచనలతో నాతని మేధ గిఱ్ఱునఁ దిరిగెను. చలికిలఁబడెను. ఎట్టయెదుర దేవాలయము కుడ్యముపై జహనారా యక్షరములు గాన్పించెను. అయ్యవి మసిబొగ్గుతో వ్రాయఁబడి యీరీతి నుండెను:

'విధి విపరీతమైనది. పినతండ్రి ప్రతాపసింగు పరమ పదించినాఁడు. నవాబిచ్చటికి వచ్చినాఁడు. నీ విచ్చటనుండువఱ కిచ్చటకు రాకుండుటవలన భగవంతుఁడు నిస్సాయిన నా కొఱకుఁగాపాడినాఁడని తలంతును. ఆతని బారినుండి తప్పించు నిమిత్తము నేను తొందరగా బ్రయాణమైతిని. నిర్భాగ్యవతి నా పినతల్లిని మృతవీరుని శరీరమును తగిన పరివారముతో బిదోలాసంస్థానము డెసకుఁ బంపినాను. మీ రీస్థలమున నుండఁ గూడదు. సాహసము వలదు. దైవముకలిసిరాలేదు. పొండు. పిన్నతల్లి నోదార్పుఁడు. ఇది నా ప్రార్థన. క్రమ్మఱ మీపాద పద్మదర్శనము భగవంతుఁడు నా కనుగ్రహించునో లేదో! పొండు! పోకుండిన మీ కుమారికయాన. ఈ లిఖితమును వెంటనే తుడిచివేయుఁడు.'

సంస్థానసింగు కుప్పగాఁ గూలిపోయెను. 'జగదేక వీరా! సోదరా!' అని యావఱచిన ట్లఱచి యా మహావీరుఁడు నేలపై నిలువునఁగూలిపోయెను. ధీరుఁడుగావున వెంటనే లబ్ధ సంజ్ఞుఁడై సింహమువలె లేచెను. కదలుచున్న గుండియల నొకచేతఁ, బగులుచున్ననొసలు నొకచేతఁ బట్టికొని దీర్ఘ నిశ్వాసమును దీసెను.

అనంతరము జలముదెచ్చి యా వ్రాతను దుడిచివేసెను. అట్లుచేసి వైద్యునిఁజూచి 'స్వామీ! మీకు శ్రమనిచ్చితిని. క్షమింపుఁడు' అని పలికి యాతనికిఁ గానుకగా కొన్ని బంగారునాణెముల నీయఁబోయెను. ఆ యుదాత్తపురుషుఁడు వానిని గైకొనక 'ప్రభూ! నేనంతనీచుఁడనుగాను. నేనును మానవుఁడనే. నాకును హృదయముగలదు. ఇట్టి విపరీతసంఘటనముపట్ల ఈకానుకను స్వీకరింపఁజాలను' అని పలికి యభివందనమాచరించి వెడలిపోయెను.

సంస్థానసింగునకుఁ బిచ్చియెత్తినట్లయ్యెను. ఎట్లో తన గుఱ్ఱమునెక్కి తన యేకైకానుచరునితోఁగూడ ఖడ్గమాత్ర సహాయుఁడై యాస్థలమును వీడెను.

---

# ఇరువదియాఱవ ప్రకరణము

## (చెఱయందలి శత్రుశాల్జీ)

అయఃకవాట పిహితమైన కారాగారమున శత్రుశాల్జీ మహారాజుంచఁబడెను. బోనులో త్రోయఁబడిన క్రుద్ధసింహమువలె ఆ వీరవరేణ్యుఁడు చెఱసాలలో రోజుచుండెను. ఆతనికన్నులనుండి కోపాగ్నిస్ఫులింగములు వెలికుఱుకుచుఁ దత్ప్రసారప్రదేశమునంతయుఁ గాల్చివైచునటుల నుండెను. ఆతఁడు సందష్టాధరుఁడు, ఆరక్తనేత్రుఁడు, కరాళీకృత ముఖుఁడు నై యటునిటు ఠీవితో నడయాడుచుండెను. అహా మృదుపావంటి రాక్షసుఁడే యాతనికడ గడగడలాడునని

నచో రక్షకభటులాతనివైపున నేని చూడఁజాలక దూర దూరముగా నొదిగియుందురనుటలో నతిశయోక్తిలేదు.

అనేకవిధములైన భావపరంపరల వలె నాతని మానసాంబుధినుండి పొడమి యడఁగుచుండెను. ఆతని క్షుభిత స్వాంతము మందరమథ్యమాన క్షీరవారాశికిఁ దులితమై యుండెను. ఇట్టిస్థితిలో నాతఁడుండఁగా నాకస్మికముగ గది తలుపు త్రోయఁబడెను. పరధ్యానముగనున్న రాజపుత్ర వీరుఁడు కన్నెత్తిచూచెను. ఎట్టయెదుట నెవ్వరు? మహారాజ్ఞి జహనారాబీగము!

శత్రుశాల్జీ విభ్రాంతుఁడయ్యెను. ఇట్టి ఘటనము కలయా! కల్లయా! భ్రాంతియా! అని యనుకొనెను. ఏమియు మాట్లాడఁజాలక నిర్నిమేషనేత్ర నీరజుఁడై శరీరమంతయుఁ గన్నులుచేసికొని చూచుచుండెను.

అంత రాజ్ఞీమణియే యీరీతి హెచ్చరించెను: 'సోదరా! వందనములు. అంతఃపురాంగనలకు, నందు శుద్ధాంతాంగనలలోని ప్రధానరాజ్ఞికిఁ దగనిపని చేసితినని నన్ను నిందింపకుము' అనిమాత్రము పలికెను.

శత్రు॥ అహమ్మదుషా యర్ధాంగి, మహమ్మదీయమతావలంబిని, ప్రతిమాదేవియేగదా మాట్లాడుచున్నది?

రాణి॥ అవును, సోదరా! అవును. నే నహమ్మదుషా యర్ధాంగినేయౌదునుగాక! మహమ్మదీయ మతావలంబినినయగుదునుగాక! నాహృదయము శుద్ధరాజపుత్త్రి హృదయమని తెలిసికొనవలసినదిగా నిన్నుఁ బ్రార్థిం

చుచు నాలలాటలేఖనము నాతప్పుగాఁ దలఁపక నన్ను క్షమింపవలసినదిగాఁ గోరుచున్నాను.

శత్రు॥ సోదరీ! ఏడెనిమిదేండ్ల వయసుననే పరాధీనవై పోయిన నిన్ను తప్పుచేసితివనజాలను. నీ సౌజన్యత వింటిని. నీస్థితిగతులను గమనించితిని. నీవు నన్నాశ్వాసించుట కిచ్చుటికి వచ్చితివని తలఁచుచున్నాను. నా పుత్రులైన భాంజీయు, భోజాజీయు నేఁడో రేపో యిచటికి నా నిమిత్తము దండెత్తి రాక మానరు. తాము గెలువలేకున్నను వీరస్వర్గమును మాత్రము చూఱగొనఁగలరు. నే నిందులనుండి తప్పించుకొనునుపాయమున్నచో మరణింపరు. నా పుత్రియగు రాణీబాయియు రక్షింపఁబడును. కాని దైవనిర్దేశము వేఱుగాఁ దోఁచుచున్నది.

అంత రాణి దుఃఖమునాపికొనుచు 'సోదరా! భయపడకుము! వీరక్షత్రియాలంకారుఁడవుగదా! నేనిపుడు విడిచిపుచ్చుచున్నాను. నీకు నేను స్వేచ్ఛ నిచ్చుచున్నాను. పొమ్ము! అనంతరవిషయములు నేను చూచికొనెదను. నే నిందులకే యిచ్చుటికి వచ్చితిని.

శత్రు॥ సోదరీ! నీదయకుఁ గృతజ్ఞుఁడను. కాని, రాజకుల సంభూతుడైన నేను దొంగవలెపోవఁజాలను. క్షమింపుము. ఎట్లు జరిగిన నట్లు జరుగును.

రాణి॥ ఆర్యా! వలదు! అట్లనవలదు! నీ సంసారము నిమిత్తము, నీ సంస్థానప్రజలనిమిత్తము నీవు కదలి

పొమ్ము! ఇది దొంగతనము గాదు. క్రియ యవస్థా నుసరణముగా నుండవలెను. రాజనీతి నీవెఱుఁగనిది. గాదుగదా! ఈ దేశమునకుఁ బ్రధానరాజ్ఞినైన నేను నిన్ను హృదయపూర్వకముగా విడిచిపెట్టుచున్నాను.

శత్రు॥ కాదు. మహారాజ్ఞీ! చక్రవర్తి కలఁడు. ఆతని యాజ్ఞ గలదు. ఆతని యాజ్ఞకు వ్యతిరేకముగా నీవుచేయుట రాజద్రోహము. అదిగాక భర్తృనాజ్ఞకు వ్యతిరేకముగా నడచు ద్రోహమునకుఁ గూడ బాల్పడుచున్నావు.

రాణి॥ ఇవన్నియు నాకుఁ దెలియును. నేనిప్పుడు రాజునకు వ్యతిరేకముగా భర్తకు వ్యతిరేకముగా ధర్మరక్షణార్థముగా నీ పనిచేయుచున్నాను. ధర్మమునకై యధర్మము నుల్లంఘించుచున్నాను.

శత్రు॥ అమ్మా! అట్లయిన నిన్ను......

రాణి॥ అవును. నవాబు కఠినుఁడై నన్ను శిక్షించును. అంతే గదా! ఈ పాపంపు గన్నులతో, నే నాత్మహత్య గావించికొనిన పవిత్రురాలు లాలాబాయిని జూచితిని. ఈపాడు కనులతోనే యుద్ధమున శతరంధ్రములు గావింపఁబడి ప్రాణములు విడిచిన పినతండ్రిని జూచితిని. నా హృదయము దేనిచేతను వ్రక్కలు గాలేదు. నాకు దేవతాస్వరూపిణి. నాకునై సుమారిరువదియేఁడులు పరిచారికారూపమునఁ బరిచర్య చేసిన మహాత్యాగమూర్తి. మాతృదేవతకంటె

నధికురాలు. అట్టి యామె భర్త గతింపఁగా నేఁడిప్పు డేడ్చి యున్మత్త ప్రాయగాఁ గాఁగాఁ జూచితిని. ఆమెను సమాశ్వాసించుటకైన నైదునిమిషములు గూడ నిలువఁజాలనైతిని. అట్టి నేనిప్పు డెట్టి యాస్థయు దేనియందు గలదాననుగాను. నవాబు శిక్షించునా? శిక్షింపనిమ్ము! నన్ను నిప్పుకుండములోఁ ద్రోయనిమ్ము! సప్రాణముగఁ జర్మమొలిపించి కుక్కలచేతఁ దినిపింపనిమ్ము. నాకిక భయములేదు. రాజ్ఞీత్వము, అర్ధాంగీత్వము, ధర్మదేవతారాధనమునకై తృణలేశముపోలె త్యజించుచున్నాను. అయ్యా! నమస్కారములు. వేగముగ వెడలుఁడు! వెడలుఁడు!

ఇట్లనుచుండఁగనే యాకస్మికముగ వికటాట్టహాసము చేయుచుఁ బ్రళయయమునివలె అహమ్మదుషా యందు ప్రవేశించి జహానారాతోఁ 'అవును. వెడలుఁడు! వెడలుఁడు! అని చెప్పుచున్నావా! రాజద్రోహమతీ! నీవు నాకు పగదానవై తిన్నయింటికి వాసములు లెక్కించుచున్నావా? పాపాత్మురాలా! నీవు కాలసర్పమవై నాయింటఁ బ్రవేశించితివా? ఏలోకమున నెవ్వరును పడనిపాటులను నీవును ఈయున్మత్తుఁడు నిఁకబడనున్నారు.' అని భయంకరధ్వనితోఁ నుడివెను.

శత్రుశూల్జియు రాణియు నప్రతిభులై యట్లే నిలుచుండిరి. అంత అహమ్మదుషా చెఱసాలబంటును బిలిచి శాంతముగా చిఱునగవుతోఁ నిట్లనెను:

'ఓరీ! నీకు రాణియందుగల భక్తికి సంతసించితిని. ఆమె యాజ్ఞ ననుసరించి తలుపుదెఱచినందుల కానందించితిని. నీకుఁ దగిన పారితోషిక మిచ్చెదను.'

'ప్రభూ! చిత్తము. మీ యన్నము దిని బ్రతుకుచున్నాఁడను' అని వాఁడు పలికెను.

'అవును. దగ్గఱకు రమ్ము. ఇదిగో! కానుక' అని పలికెను. ఆనందోన్మత్తుఁడగు ఆవృద్ధసేవకుఁడు వంగి వంగి సలాములు చేయుచు దగ్గఱకు వచ్చెను. పాపము! ఆ వృద్ధసేవకుని శిరము నహమ్మదుషా యొక్క దెబ్బతో నెగురఁగొట్టెను. చిమ్మనగ్రోవినుండి సంజకెంజాయరంగు నీరువలె వేడి నెత్తురువెల్లువ నలుప్రైపుల వర్షమువలె చిమ్మెను. కాయము శిరమునకు వేఱై పడి పొరలిపొరలి వినిశ్చలమయ్యెను.

ఈ పైశాచికఘటనము జహానారా శత్రుశూల్జీల నెట్టి మనస్సుగలవారిగాఁ జేసినదో యూహించికొనవలసినదే కాని చెప్పవలసిన పనిలేదు. రాజ్ఞీమణి వడవడ వడంకి మరల చైతన్యమును దెచ్చికొని 'ప్రభూ! ఏమి పైశాచిక నటనము సలిపితివి! అల్లా నిన్ను క్షమించుఁగాక!' అనెను.

అంతట నహమ్మదుషా వికటహాసముగావించి 'అల్లా నన్ను క్షమింపనిమ్ము! క్షమింపకుండిన నుండనిమ్ము! ఇంకను నేనిచ్చట నాడవలసిన నాటకభాగము దీర్ఘముగా గలదు.' అని పలికెను.

అంతతో నిలువక మరలనిట్లనెను. 'ఏతద్రాజ్యాధిపతి యబలచేతి కీలుబొమ్మగాక, నిరంకుశ విశృంఖల వీరవిహా

రాధికారములుగల చండశాసనుఁడని లోకము నేఁడు గుర్తెఱుంగుఁ గాక! ఏయున్మాదిని తనదియె సర్వాధికారమను భ్రాంతిలో నిన్ని కార్యములు నడపుచున్నదో యా కపటనటనాధురీణయగు జహానారా నేఁడు నేనెవ్వఁడనో తెలిసికొనును గాక? సరియే, నీ సంగతియటుండ నిమ్ము!'

అని పలికి వగపునునటించు ప్రళయప్రహాసముతో శత్రుశాల్జీనిజూచి మీసలపై చేయివేసికొని తలయూఁపుచు 'పోయెదవా, పోయెదవా! ఆహా! రాజ్ఞీమణి విడిపింపవచ్చినది. మహారాజు చెఱనుండి వెలువడు చున్నాఁడు. ఓయీ! నీవు క్షత్రియుఁడ నందువే! మీ రాజపుత్రులెక్కుడుగా నల్లమందు తినెద్దరనియు, వ్యర్థ ప్రతిజ్ఞలఁ జేయుదురనియు విను చున్నాను. అంతేకాదు. కోఁలలూడిన పామువలె బుసగొట్టెదరని వింటిని. లాభమేమి? కావున నేనొకమాట చెప్పెద వినుము. నన్ను నీకల్లునిగాఁ జేసికొమ్ము!'

ఈ వాక్యమాతని నోటివెంట వెడలినదోలేదో శృంఖలాబద్ధుఁడగు శత్రుశాల్జీ హుంకరించి మీఁది కుఱికెను గాని యయఃశృంఖలలు విడివడలేదు.

అంత నవాబు నవ్వుచు మరలనిట్లనెను. 'సెబాసు! ప్రతాపము బాగుగాఁ జూపితివి. రాజపుత్రి శౌర్యమిదియే గాబోలును. ఈ యున్మత్తతతో ప్రయోజనములేదు. నీకు రాణీబాయియను పుత్త్రిక యున్నదిగదా! ఆమెను నాకరములం దుంపుము. నారాజ్యము నీ కప్పగింతును. వాథోజీ సోదరులు మరణించినారు. వారిరాజ్యభాగముగూడ నాకడ

నున్నది. దానికిఁగూడ ప్రతినిధిగా నిన్ను నియమింతును. నీ కుమారకులకుఁ దగినబిరుదములు గౌరవములు నిచ్చెదను. తెలివితక్కువదనముచే రానున్న సిరిని కాల్దన్నకుము.'

ఇట్లు పలికిన యహమ్మదుషాను రాజపుత్రవీరుఁడు రోషావేశముతోఁ జూచి, పలుకజాలకపోయెను. మఱి యొకసారి హుంకరించెను. ఈ హుంకారముచే శృంఖలలు తుత్తునియలై నేల బడెను. ఆకస్మికముగఁ బాముపైఁబడు గరుడపక్షియుఁబోలె అహమ్మదుషాపైఁ బడెను. ఎడమకాలితో వక్షస్థలమునుదన్నెను. ఆ తన్నుతో అహమ్మదుషా గతసంజ్ఞుఁడై పదిగజములదూరములోఁ బడెను. అతనికత్తిని గ్రహించి పైఁబడఁబోయెను. అంత జహానారా యొద్దువచ్చి 'ప్రాణదానము చేయుము' అని పాదములపైఁ బడెను. ఆతఁడు దూరముగాతొలఁగి 'సోదరీ! నీ యొద్దు లేనిచో వీఁడీపాటికి యమలోకము చేరియుండును' అని పలికెను.

ఇంతలో అహమ్మదుషాకు మెలఁకువవచ్చి సమాళించికొని యాగరానికోపముతో నిలుచుండెను. ఈ కల్లోలమును విని పదుగురుభటు లచ్చటికి వచ్చిరి. వారాకస్మికముగ రాజపుత్రునిపైఁ బడనుండిరి. నవాబు శత్రుశూల్జీని జూచి 'బలవంతుఁడవే! క్షమించితిని. దీనిచే నైన నా యాధార్య్యము గ్రహింపుము. నీవు నీ పుత్రిని దెచ్చి నా పాదములపైఁ బడవేయనిచో నిన్ను భూతభేతాళములకు విందుగా ఖండించెదను. నీ సంస్థానమును మంటలోఁగలిపెదను' అనిపలికెను.

అంత శత్రుశాల్జీ 'ఈ సంస్థానములు వెంటరావు. నాప్రాణము శాశ్వతముగాదు. నీవు నన్నేమియుఁ జేయఁజాలవు. నిన్ను నే సంహరింపఁ గలిగియు నోర్పున భూమాతయగు ప్రతిమా దేవి ప్రార్థనముచే విడిచితిని. శత్రుశాల్జీ పాదదాసుఁడవు గమ్ము; విడిచితిని. ఇటుచూడుము. ప్రాణములపై మాకెంత చిన్నచూపో తెలిసికొనుము' అనుచుఁ జేతియందలి వజ్రపు టుంగరమును గొఱికికొని రత్నమును నమిలి విగతసంజ్ఞుఁడై నేలఁబడెను.

అంత సహమ్మదుషా యాతని శౌర్యమునకు విభ్రాంతుఁడయ్యు నీచుఁడు కఠినుఁడు గావున 'కుక్క యఱచి యఱచి మరణించినది' అనుచు నెడమకాలితో నాతని శిరమును దన్ని యట్టహాసముగావించి, జహానారాను గాంచి 'ఇఁక నీ సంగతి?' అని యడిగెను.

జహానారా దుర్భర మానసికావస్థలో నుండెను. భావోన్మత్తవలె కాన్పించుచుండెను. ఇన్నాళ్లు తానొక పిశాచముతోఁ గాఁపురము జేసితినని తాను తెలిసికొనెను. ప్రాణములపై వైరాగ్యము కలిగెను. సహజశౌర్యోపేతమగు పవిత్రరక్తముప్పొంగెను. ఆమె ప్రళయదుర్గామూర్తివలె గర్జించి, తుపానువలె రేఁగి, వడగండ్లవలె వాగ్వర్షమును గుఱిపింపసాగెను.

# ఇరువదియేడవ ప్రకరణము

## (జహనారా యంతిమవాక్కు)

'ప్రభూ! మీరాడుచున్న ఈ ప్రళయభైరవ నాటకమును జూచుచున్నాను. అహంకార మమకార వ్యసన పిశాచావిష్టుఁడవై నీ వాడుచున్న ఈ యాట దుర్భరము. నన్ను గపటవర్తినిగా నిరూపించితివి. ఎవ్వఁడు లోకకంటకుఁడై, హిందూమత ద్రోహియై, రాజకుటుంబ కాంతా భీకరుఁడై యున్నాఁడో, యట్టినిన్ను నుత్తమోత్తమ పథమునకుఁ ద్రిప్పి నాకుఁదోచిన సంస్కార మూలమున నిన్నుద్ధరించి తన్మూలమున నన్నుద్ధరించికొని లోకమును గాపాడఁగలనని తలఁచితిని. కాని నాయత్నములు నీ వశ్యముచేసికొనలేక వ్యర్థజీవనుఁడవై నన్ను వ్యర్థజీవితగాఁ జేయుటయేగాక, శత్రుపక్ష కాంతనుగాఁ బలుకుచున్నావు. నా బంధువర్గము నకుఁగాని నీకుఁగాని తీరని కళంకమురాని గతులకై శతధా సహస్రధా ప్రయత్నించియుఁ జాలనైతిని. హిందూమహమ్మదీయ సమ్మేళనముపేర నీవు హిందూక్షత్రియ కామినుల మానములఁ జూఱగొనుచుండగా మిన్నకుంటిని. హిందూ మహమ్మదీయ సఖ్యత కీయది యవసరమని కపట రాజకీయ సమ్మోహనాస్త్రమును వైచి చాటిచెప్పుచున్నావు. ఇయ్యది కన్నులుగానని కాముక వ్యాపారముగా నేను ఘంటాపథమునఁ జెప్పుచున్నాను. హిందూస్త్రీలు బలాత్కరింపఁబడి యవనులచే వివాహమునఁ గొనబడుటయే హిం

దూమహమ్మదీయ సంఖ్యతకు చిహ్నముగాదు. స్వచ్ఛమగు ముసల్మాను వంశస్థులగు రాజాంగనలను మీరు హిందూవంశస్థులకీయరు. వారును బెండ్లియాడరు. పెండ్లికొప్పికొనినవారికైన నీయరు. హైందవపక్షమునమాత్ర మన్యాయము జరుగుచున్నది. అయినను నేను, మీ రొకనాఁడు గాకున్న మఱి యొకనాఁడైన నుత్తమ పథమునన డుగుపెట్టరా యను నాసతోనుంటిని. కాని, నాప్రయత్నములు వ్యర్థమైనవి. లాలాబాయిని నేను దుర్గతినుండి తప్పింపఁగలిగియు మీ యందలి యనురాగముచే నేనాపని చేయలేదు. నేను రాజపుత్రాంగననని తెలిసికొని, నాకపచారము చేయ జంకియే రాజపుత్రు లొక్కనాఁడును మీవధార్థము కత్తినెత్తలేదు. ఆఁబోన్న సింగములవంటివారును, భీమపరశురామసదృశులునైన ప్రతాపసింహ, సంస్థానసింగులవంటివారు మిమ్మువిడుచుట నామంగళసూత్ర విచ్ఛేదనమునకు వారలోర్వకుండుటయే. అరఘడియక్రింద ఈ మరణించిన మహారాజు మిమ్ముఁ గాపాడుటగూడ నాప్రార్థనముమీఁదనే. కాని మీరు వీనినన్నిఁటిని గమనింపలేదు.

నీవు చేసిన మానవతీజనాపరాధము శరీరమును జలదరింపఁజేయుచున్నది. పురాణములయందు చెప్పఁబడిన రావణప్రభృతులు గూడ యింత కామాంధులై ప్రజాకంటకులై ప్రవర్తింపలేదు. మీపాపములుక్షమింపరానివి. దేవుని సన్నిధానమున నీవు మీనేరములు సమ్మతించు దన మొకనాఁడు తప్పక వచ్చితీరును.

నాకు సర్వాధికారము లిచ్చి చెడినరీతిఁ బలుకుచు న్నారు. ప్రభూ! నే నా యధికారములకుఁ గులుకలేదు. ప్రజలకు సాధ్యమైనంత మేలు పొనరించి మీరొనరించు మహాపాతకములకు శాంతిని బొనరించితిని. నేను లేనిచో నెప్పుడో విప్లవము చెలరేఁగి మిమ్ము సింహాసనభ్రష్టునిఁజేసి, మీతలను శూలమునఁ గ్రుచ్చి యూరేఁగించియుఁదురని ముక్తకంఠముతో యథార్థము వాకొనుచున్న నన్నహంకారిగా నెన్నకుఁడు. అట్టి యీ యుపకారపరాయణయగు మీ చరణదాసిని నన్ను నన్యాయఁగా, కుటిలగా, వంచకురాలిగా, రాజద్రోహమతిగాఁ బలుకుచున్న మిమ్ము చూచుటకు, వినుటకు నేను మిక్కిలి వగచుచున్నాను.

ప్రభూ! నేను మీకొనరించిన సేవలను మఱచితిరా? చర్మమొలిచి పాదరక్షలు నిర్మించుట తక్క మిగిలిన యన్ని సేవలను నేను చేసితిని. మీరు మహమ్మదీయులరని నే నేవగించికొనలేదు. ఒకానొక కాలమున మీ పితృపితామహులు హైందవ రాజపుత్రి వంశస్థులనియు, వారిపవిత్ర రక్తము కొంత మీశరీరములోఁ బాఱుచున్నదనియుఁ దలఁచితిని. కాని మీరు నన్ను విశ్వసింపలేదు. ఓహో! నేఁజేసిన సేవకు మీకుఁగృతజ్ఞతలేదు. సరిగదా! నాసేవలను మఱచి నన్నుఁ గఠినశిక్షలఁ బాల్పఱుపఁ బ్రయత్నించుచున్నారు.

అధికారాంధుఁడవు. దైవగతులను నిర్ణయములను దెలిసికొనఁజాలని వ్యక్తివి. అంతయు నీవలననే జరుగుచున్నదని యనుకొను నహంకార పంకము నీయందు పూర్తిగా

నున్నది. మీవ్యసనములు మిమ్ము స్వాశ్రయమును గాల్చు నగ్నివలె దహించుచున్నవి. తలపైఁ గిరీటము బరువుచేటు గను, నలంకారప్రాయముగను నున్నదిగాని, పవిత్రప్రజా రక్షణబాధ్యతచే బద్ధమైన రాజచిహ్నముగా మీకుఁగాన్పింప లేదు. తుచ్ఛనటకుఁడు సామ్రాడ్రూపమును ధరించినట్టుల నున్న మీరు సామ్రాట్టులా?

మీవంటిరాక్షసులు లోకములో లేరు. లాలాబాయి మరణము, నామె తుదివాక్కులు కులపర్వతములనైనఁ గదల్చివేయునుగాని మిమ్ముగదల్పఁజాలకపోయినవి. ఈ ఘటనము జరిగిన వెనువెంటనే సంస్థానసింగు కుటుంబమునకు నిప్పుఁబెట్టఁజూచిన పరమనీచత మీయందు మూర్తీభవించినది. నిప్పు పెట్టితిరి. రత్నమువంటి ప్రతాపసింగును పొట్టపెట్టికొంటిరి. మహాసాధ్వియగు సరళామహాదేవి నున్మత్తప్రాయఁగా జేసితిరి.

అహో! శత్రుశూల్జి! ఈతనినిఁదలఁచిన శరీరము పులకరించుచున్నది. ఆపత్సమయమునఁగూడ చెఱనుండి వెడల సమ్మతింపలేదు. ఎన్నియాసలు చూపినను తన కులగౌరవములకు భంగము గల్పించుకొనలేదు. మీ రిట్టి వీరుని పూజింపలేదు. అయిదునిమిషములకుపూర్వమిచ్చటనే యాతని పదవిన్యాసముచే పవిత్రమైనయీకారాగారముననే మీరు వానికిఁ బులిచేతికిఁజిక్కిన మేఁకవలెఁ జిక్కినపుడు 'ప్రతిభిక్ష' నేనర్థింపఁగా అట్లేయని సహజౌదార్యబుద్ధితో విడిచినాఁడు. నిస్స్వార్థము, పవిత్రమూన ప్రేరితము నగు భావముచే నాతఁడాత్మ

హత్యనుగావించికొనెను. అహో! ఎట్టి మహాత్ముఁడు మరణించినాఁడు. దేవత లెచ్చటగలరు! మానవులయందే దేవతలు గలరు. మీవంటి రాక్షసులు దేవతలను బాధింతురు. వారిమహత్తరగుణములను దెలిసికొనఁజాలరు. దీనికి నేనంత చింతింపనుగాని యట్టి మహాత్ముఁడు మరణించినవెనుక నెడమకాలితో మూర్ధాభిషిక్తుఁడగు నాతని పవిత్రశిరమును దన్నితిరి. ఇది ఎట్టి నీచకృత్యము! ఇది యెంత మేఱమీఱిన లోపమో మీరు తెలిసికొనక, వికటాట్టహాసము, శ్మశానపిశాచివలె చేయుచున్నారు.

పరమసాధువుల పచ్చినెత్తురు ద్రావు పిశాచముగా మిమ్మింతవఱకు గుర్తింపలేక కన్నులుమూసికొంటిని. నేఁడు మీయథార్థరూపము దెలిసికొంటిని. ఇన్నిదినము లట్లు తెలియక చెడిపోయితిని. మీచరణసేవచేసితిని. మిమ్ముఁ ద్రికరణముల నభిమానించితిని. అట్టి నన్ను తూలనాడితిరి. మీకు హృదయము లేదు. పాషాణగర్భమునఁగూడ స్వాదు నీరమున్నది. కానకప్ప బ్రతుకఁగలుగుచున్నది. కాని మీహృదయమరుభూమియందు ప్రేమరసలేశము లేదు. మండూకమునకుండఁగలిగిన వసతిగూడ యిట లేదు.

అయ్యో! మిమ్ము సేవించుటకై మీరాజ్య ప్రశాంతతకై నేను పడినపాట్లలో సహస్రాంశము తుదకు దశసహస్రాంశము దైవసేవలో కడపియుండినచో నేఁటికాఁతడు నన్నుత్తమస్థితిలో నుంచియుండును. మ్లేచ్ఛుని మిమ్ము సేవించుటలో దైవసేవగూడ మఱచితిని.

మూఢుఁడా! కృతఘ్నుఁడా! వ్యసనపిశాచీ! నేను ధర్మపథావలంబినినై పూర్ణవైరాగ్యమతినై కన్నులు దెఱచి మిమ్ము- కాదు నిన్ను-రాక్షసునిగాఁ దెలిసి నీకు నాకుఁ గల సంబంధము నేఁటితో త్రెంచివేయుచున్నాను.

నేను మహాపాపిని. కేవలమసమర్థను. నిన్ను మనసార సేవించియు నీకు శత్రుమూర్తిగా గనపడితిని. నావంశ గౌరవమును మంటఁ గలిపితిని. లాలాబాయి మరణము, ప్రతాపసింగు మరణము, సరళాదేవి యున్మత్తశోకము, పెక్కురు రాజపుత్త్రిల మరణములు నావలననే, నాయసమర్థతాదోషముననే యేర్పడినవిగాఁ దలఁచుచున్నాను.

నేఁ దలపెట్టిన కృత్యసమితి ధర్మరక్షణార్థమే కాని, కృతకృత్యురాలను గాలేదు, కాలేకపోయితిని. అట్టి యసమర్థనగు నేనుండి యేమిప్రయోజనము? ఆప్తబంధువులు నశింపఁగా, నాత్మనాథుఁడు దైత్యుఁడు కాఁగా, నాత్మీయ కార్యములు వ్యర్థములుకాఁగా, ఈ నిరుపయోగజీవనమున సుఖము లేదు; శాంతి లేదు.

ప్రభూ! కడసారిమాట చెప్పుచున్నాను. హిందూ మహమ్మదీయుల సఖ్యతకు నేఁడైన హృదయపూర్వకముగఁ బాటుబడుఁడు. పాక్షికదృష్టిని విడువుఁడు. ఉత్తరవయస్సు వచ్చినది. మిత్తి గంటకొట్టి హెచ్చరించి పిలువను. స్వర్గద్వారము మీకై తెఱువఁబడి పూలదారులు మీఁదుగా దేవకన్య లాహ్వానించి కల్పక ప్రసూనముల మీయుత

వేయరు. శేషజీవితమును బవిత్రీకృతమొనర్చికొనుఁడు. రాక్షసత్వము, పైశాచికనటనము, నిర్దయారంభము విడువుడు.'

ఇట్లు పలికి యా పవిత్రనారి యాతనిపాదముల నంటి లేచి డగ్గుత్తికతోఁ గన్నులబాష్పపూరములు రాలుచుండ, 'స్వామీ! మీకు నేను సతిగా నుండుటచే, మీ పదములు నేను మహాప్రస్థానమునకుపూర్వ మంటి సెలవుఁ గైకొను చున్నాను. ప్రాణప్రయాణసమయము ద్వేషాద్వేషరహిత ముగా నుండవలెనుగదా! స్వామీ! నన్ను చెట్టపట్టిన మీకు నేనెట్టి సమయముననైన నెట్టి ద్రోహమునైనఁ జేసియుంఁడినయెడల నన్ను హృదయపూర్వకముగ క్షమిం పుఁడు! నేటితో మన ఈ భౌతిక ఋణానుబంధము తెగి పోవుచున్నది. నా నటనము పూర్తియైనది. అంతిమ నేపథ్యము పడనున్నది. సూత్రధారుఁడు పిలుచుచున్నాఁడు. నా లాలా బాయి నన్నాహ్వానించుచున్నది. నాపినతండ్రి ప్రతాప సింగు నన్నాహ్వానించుచున్నాఁడు. నా తుదికోరిక ప్రభూ! మన్నింపుఁడు! పవిత్రమూర్తి లాలాబాయి సన్నిధినే ఈ ధన్యురాలి భౌతికశేషములఁజేర్చి సమాధి నిర్మింపుఁడు. భగవంతుఁడు మీకు మేలుచేయుఁగాక!'

అనుచు వక్షఃప్రదేశమునఁ గల గుప్తమగు సన్నని పాముసంటి ఖడ్గము నాకస్మికముగఁ దీసికొని తెప్పపాటులో కంఠనాళము ఛేదించుకొని మహారాజ్ఞీమణి నేలఁబడిపోయెను.

అంతయు నిమిషములో జరిగిపోయినది. మెఱపు మెఱసిన తెఱఁగునఁ బ్రాణ మెగసిపోయినది.

నవాబున్మత్తునివలె నిలుచుండెను. ఆకస్మికముగఁ గెవ్వునఁ గేకవైచి 'జహానారా! జహానారా! నా జహానారా!' అని యఱచుచు మొదలంటనఱికిన యరఁటిచెట్టువలె గుప్పున నేలఁబడిపోయెను.

## సమాప్తి

లాలాశాయి సమాధికడనే చలువఱాళ్లతో నత్యున్నతమగు సమాధి జహానారాబీగమునకై నిర్మింపఁబడెను. నవాబు హృదయమున సంపూర్ణమగు మార్పుగలిగెను. పశ్చాత్తాపవహ్ని యాతనిఁ బవిత్రునిగా నొనరించెను. ఈ పరివర్తనముతోఁబాటతఁడు హైందవాంగనల జోలికిఁ బోలేదు. హిందూమహమ్మదీయ సమ్మేళనమునకు మిగులఁ బాటుపడెను. ఈ యద్భుత ప్రవర్తనమునకుఁ బ్రజలెల్లరు నాశ్చర్యసంతోష భరితులైరి.

సరళ పిచ్చెత్తిపోయెను. అప్పుడప్పు డీ సమాధుల సన్నిధానమునకువచ్చి పూజాపుష్పములు వైచిపోవుచుండును. నవాబామెనుజూచినపుడెల్ల స్తంభితుఁడగుచుండును. ఆతనిఁ జూచిన సరళ పకపకనగి యాకసము వైపు ప్రేలుచూపి చఱచఱ వెడలిపోవుచుండును.

పదునైదవ శతాబ్ద పూర్వభాగమున నీఘటనము జరిగినను నచ్చటివారికిప్పటికి నీ కథలు వీరగాథలై పవిత్రములై గేయములై శరీరమును బులకరింపఁజేయుచుండును.

అమరకీర్తు లచ్యుతులుగదా! ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

Printed at The Liberty Press, 10, Linghi Chetty St., Madras.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B127 |
| పుస్తకం పేరు | ప్రతిమాదేవి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 161 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | rehana |
| స్కాన్ చేసినది | Moonika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |